# శ్రీ గురుచరిత్ర

## నిత్య పారాయణ గ్రంథము

రచయిత:

**పూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ**

ప్రచురణ :
శ్రీ మంగభరద్వాజ ట్రస్ట్,
for శ్రీ గురుపాదుకా పబ్లికేషన్స్
12-1-170/46P, Bhaktha Nivas
Jaipuri Colony, Nagole, Hyderabad - 500 068
Phone: 7416041550
www.saibharadwaja.org
www.saimasterforums.org

# శ్రీ గురుచరిత్ర



ప్రథమ ముద్రణ : 1982
**Reprint - 2022**

**వెల: 150/-**

ప్రతులకు

Cell : 7416041550.
SRI MANGA BHARADWAJA TRUST
Registered Office : Bhakta Nivas, 12-1-70/46P,
Hanuman Nagar, Jaipuri Colony, Nagole,
HYDERABAD, Telagana Dist. - 500 068.

Ph : 08592-233271
**SRI MANGA BHARADWAJA TRUST**
Ongole Branch Office : Kothapeta, Kondaiah Bunk
Street, Ongole, Andhra Pradesh - 523 002.

# శ్రీ గురుచరిత్ర - పారాయణ పద్ధతి

శ్రీ గురుచరిత్ర పారాయణను కులమత ప్రసక్తి లేకుండా అందరూ చేసుకొనవచ్చును. ఈ చరిత్ర పారాయణ చేయదలచిన వారు ఉదయం స్నానం చేసి ఏమీ తినకముందు, దేవుని ముందు కూర్చుని, దీపారాధన చేసి, అగరువత్తులు వెలిగించి పారాయణ చేసుకోవాలి. కాఫీ, పాలు మొదలైన ద్రవపదార్థాలు తీసుకొనవచ్చు. ఉదయము పారాయణ చేసుకొనుటకు అవకాశము లేనివారు సాయంత్రము స్నానము చేసి పారాయణ చేసుకొనవచ్చు. ఒక పూటలో ఆరోజు చేయవలసిన పారాయణ పూర్తి చేయడానికి వీలుపడనపుడు ఉదయం కొన్ని అధ్యాయాలు, సాయంత్రం మరల స్నానం చేసి మిగిలిన అధ్యాయాలు పైన చెప్పినట్లు పూర్తి చేసుకొనవచ్చు. ఉదయం పారాయణ చేసుకొనుటకు ఏమాత్రమూ వీలుపడని వారు సాయంత్రముగాని, రాత్రిపూట గాని స్నానము చేసి భోజనము చేయకముందు పారాయణ చేసుకొనవచ్చు.

**ఇంతకు మించి ఆహార విహారాదులలో ఎట్టి నియమములూ అవసరము లేదు.**

ఒక్క రోజులో గ్రంధం మొత్తం పారాయణ పూర్తి చేయాలనుకున్నవారు పండ్లు తీసుకొనవచ్చును. పాలు వంటి ద్రవపదార్ధములు గూడ తీసుకొనవచ్చును.

సప్తాహ పారాయణ (ఒక వారము లేక 7 రోజులు) పూర్తి చేయలేనివారు ద్విసప్తాహపారాయణ (2వారాలు) గాని, త్రిసప్తాహ పారాయణ (21రోజులు) గాని చేసుకొనవచ్చు. అందుకుగూడ అవకాశం లేనివారు రోజుకు ఒక అధ్యాయము చొ॥న పారాయణ చేసుకొనవచ్చు. స్త్రీలు బహిష్టు సమయంలో ఈ చరిత్ర పారాయణ చేయకూడదు.

సామాన్యంగా మనం పారాయణ చేసే గ్రంధం ఎవరికీ ఇవ్వకుండడం మంచిది. కొన్ని ఆవర్తాలు (కొన్నిసార్లు) పారాయణ పూర్తి అయ్యాక, కొద్ది దక్షిణతో పాటు ఈ గ్రంధప్రతి నొకటి ఎవరికైనా దానం చేస్తే ముల్లోకాలలోను దానం చేసిన పుణ్యఫలం వస్తుంది.

స్నానానికి గూడ అవకాశం లేనపుడు గాని, ఆరోగ్యం సరిగా లేనపుడుగాని.

శ్లో॥ అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాన్ గత 2. పివా

యస్మరేత్ పుండరీకాక్షం స బాహ్యాభ్యంతర శ్శుచిః ॥

అనే శ్లోకాన్ని చెప్పుకొని, తీర్థాన్ని గురుపాదోదకంగా భావించి, కొంచెం త్రాగి, కొంచెం శిరస్సున చల్లుకొని పారాయణ చేయవచ్చు. "హృదయ కమలంలో వున్న చైతన్యమే తన నేత్రముగా గల భగవంతుని స్మరిస్తే ఎట్టి స్థితులలో వున్నవారైనా బాహ్యాభ్యంతరముల యందు శుచియౌతారు" అని ఈ శ్లోకానికర్థం.

స్వయంగా పారాయణ చేయలేనివారు శ్రీ గురుచరిత్ర శ్రవణం చేసినా అదే ఫలితముంటుందని శ్రీగురుడు చెప్పారు.

## శ్రీ గురుచరిత్ర

పారాయణ చేయడానికి వీలుగాని సమయంలో 'దత్త దత్త' అనిగాని, శ్రీదత్త జయదత్త అన్న నామంగాని సప్తాహము చేయవచ్చు. ప్రతిరోజూ నిత్యపారాయణ అయిన తర్వాత దత్తస్తోత్రాలలో

శ్లో॥ అనసూయాత్రి సంభూతో దత్తాత్రేయో దిగంబరః ।
స్మర్తృగామీ స్వభాక్తానాముద్ధర్తా భవసంకటాత్ ॥
**అన్న శ్లోకం యథాశక్తి జపంచేస్తే కష్టాలు తొలుగుతాయి.**

శ్లో॥ జీవయామాస భర్తారం మృతం సత్యాహి మృత్యుహా ।
మృత్యుంజయ స్స యోగీంద్రః సౌభాగ్యం మే ప్రయచ్ఛతు ॥
**అన్నశ్లోకం యథాశక్తి జపంచేస్తే సౌభాగ్యం వృద్ధి చెందుతుంది.**

శ్లో॥ దూరీకృత్య పిశాచార్తిం జీవయిత్వా మృతం సుతమ్ ।
యో...భూదభీష్టదః పాతు స నః సంతానవృద్ధికృత్ ॥
**అన్న శ్లోకం యథాశక్తి జపంచేస్తే సంతానాన్ని ప్రసాదిస్తుంది.**

శ్లో॥ దరిద్ర విప్ర గేహే యః శాకం భుక్త్వోత్తమ శ్రియమ్
దదౌ శ్రీదత్త దేవః దారిద్ర్యాత్ శ్రీప్రదోవతు ॥
**అన్న శ్లోకం యథాశక్తి జపం చేస్తే దారిద్ర్యాన్ని తొలగించి సంపదనిస్తుంది.**



# గ్రంథ పారాయణ పద్ధతి

**సప్తాహ పారాయణము**

**గురువారం 1వ అధ్యాయం నుండి 9వ అధ్యాయం వరకు**

**శుక్రవారం 10వ అధ్యాయం నుండి 21వ అధ్యాయం వరకు**

**శనివారం 22వ అధ్యాయం నుండి 29వ అధ్యాయం వరకు**

**ఆదివారం 30వ అధ్యాయం నుండి 35వ అధ్యాయం వరకు**

**సోమవారం 36వ అధ్యాయం నుండి 38వ అధ్యాయం వరకు**

**మంగళవారం 39వ అధ్యాయం నుండి 43వ అధ్యాయం వరకు**

**బుధవారం 44వ అధ్యాయం నుండి 52వ అధ్యాయం వరకు**



# గ్రంథ పారాయణ పద్ధతి

**ద్విసప్తాహ పారాయణము**

**గురువారము 1వ అధ్యాయం నుండి 2వ అధ్యాయం వరకు**
**శుక్రవారము 3వ అధ్యాయం నుండి 6వ అధ్యాయం వరకు**
**శనివారము 7వ అధ్యాయం నుండి 10వ అధ్యాయం వరకు**
**ఆదివారము 11వ అధ్యాయం నుండి 13వ అధ్యాయం వరకు**
**సోమవారము 14వ అధ్యాయం నుండి 18వ అధ్యాయం వరకు**
**మంగళవారము 19వ అధ్యాయం నుండి 23వ అధ్యాయం వరకు**

**బుధవారము 24వ అధ్యాయం నుండి 27వ అధ్యాయం వరకు**
**గురువార 28వ అధ్యాయం నుండి 30వ అధ్యాయం వరకు**
**శుక్రవారము 31వ అధ్యాయం నుండి 35వ అధ్యాయం వరకు**
**శనివారము 36వ అధ్యాయం నుండి 39వ అధ్యాయం వరకు**
**ఆదివారము 40వ అధ్యాయం నుండి 47వ అధ్యాయం వరకు**
**సోమవారము 42వ అధ్యాయం నుండి 45వ అధ్యాయం వరకు**
**మంగళవారము 46వ అధ్యాయం నుండి 49వ అధ్యాయం వరకు**
**బుధవారము 50వ అధ్యాయం నుండి 52వ అధ్యాయం వరకు**



# గ్రంథ పారాయణ పద్ధతి

## త్రిసప్తాహ పారాయణము

**గురువారము 1వ అధ్యాయం నుండి 2వ అధ్యాయం వరకు**
**శుక్రవారము 3వ అధ్యాయం నుండి 4వ అధ్యాయం వరకు**
**శనివారము 5వ అధ్యాయం నుండి 6వ అధ్యాయం వరకు**
**ఆదివారము 7వ అధ్యాయం నుండి 8వ అధ్యాయం వరకు**
**సోమవారము 9వ అధ్యాయం నుండి 11వ అధ్యాయం వరకు**
**మంగళవారము 12వ అధ్యాయం నుండి 13వ అధ్యాయం వరకు**
**బుధవారము 14వ అధ్యాయం నుండి 16వ అధ్యాయం వరకు**

| | | |
|---|---|---|
| గురువారము | 17వ అధ్యాయం నుండి | 19వ అధ్యాయం వరకు |
| శుక్రవారము | 20వ అధ్యాయం నుండి | 22వ అధ్యాయం వరకు |
| శనివారము | 23వ అధ్యాయం నుండి | 25వ అధ్యాయం వరకు |
| ఆదివారము | 26వ అధ్యాయం నుండి | 28వ అధ్యాయం వరకు |
| సోమవారము | 29వ అధ్యాయం నుండి | 30వ అధ్యాయం వరకు |
| మంగళవార | 31వ అధ్యాయం నుండి | 32వ అధ్యాయం వరకు |
| బుధవారము | 33వ అధ్యాయం నుండి | 35వ అధ్యాయం వరకు |
| గురువారము | 36వ అధ్యాయం నుండి | 38వ అధ్యాయం వరకు |
| శుక్రవారము | 39వ అధ్యాయం నుండి | 40వ అధ్యాయం వరకు |
| శనివారము | 41వ అధ్యాయం నుండి | 42వ అధ్యాయం వరకు |
| ఆదివారము | 43వ అధ్యాయం నుండి | 45వ అధ్యాయం వరకు |
| సోమవారము | 46వ అధ్యాయం నుండి | 48వ అధ్యాయం వరకు |
| మంగళవారము | 49వ అధ్యాయం నుండి | 50వ అధ్యాయం వరకు |
| బుధవారము | 51వ అధ్యాయం నుండి | 52వ అధ్యాయం వరకు |

# శ్రీ గురుచరిత్ర

## Table of Contents

# శ్రీ గురుచరిత్ర

# శ్రీ గురుచరిత్ర

# శ్రీ గురుచరిత్ర



## ముఖ్య సూచన

**శిరిడీ సాయిబాబా భక్తులకు "శ్రీ గురుచరిత్ర" పారాయణ యెంతో అవసరం.** హరివినాయక్ సాఠే, అన్నా సాహెబ్ దభోల్కర్ వంటి వారికి శ్రీసాయిబాబా దర్శనము, అనుగ్రహము లభించడానికి "**శ్రీ గురుచరిత్ర**" పారాయణమే కారణమయింది. కుశాభావు అనే భక్తుడి విషయంలో యీ సత్యం యింకెంతో స్పష్టంగా కన్పిస్తుంది. **అతడి చేత యీ గ్రంథాన్ని 108 సార్లు పారాయణ చేయించడంలో సాయినాథుడు దీనికెంత ప్రాముఖ్యమిచ్చారో తెలుస్తుంది.** ఆయన మహాత్ములందరిలోకి తలమానికము - కోహినూర్ వంటి వారైనప్పటికీ తాను సద్గురువునని చెప్పక, అతి సామాన్యుడిలా జీవించారు. భక్తులు తమను గురువుగా యెలా సేవించాలో యెన్నడూ చెప్పలేదు. భగవద్గీతా శ్లోకాన్ని వివరించినప్పుడు ఆ విషయమై రత్నాల్లాంటి మాటలు ఒకటి రెండు మాత్రమే చెప్పారు. అందుకే ఆయనను ఆ రీతిన యెవరూ ప్రయత్నించలేదు. ప్రయత్నించిన కొద్దిమందీ గూడ చేయలేకపోయారు. అలాగాక, గురుచరిత్రలో శ్రీగురుడు ఎన్నో పురాణోపాఖ్యానాల సహాయంతో యీ విషయం వివరించారు. **అంటే భక్తులు ఎలా శ్రీ సాయిని సేవించాలో "శ్రీ గురుచరిత్ర" నుండి నేర్చుకోమని శ్రీ సాయి సూచించారన్నమాట.**

# ముందుమాట

## మేము ప్రచురిస్తున్న యీ " శ్రీ గురు చరిత్ర" కు కొన్ని ప్రత్యేకతలున్నాయి. అది తెలియాలంటే యీ క్రింది విషయాలు గమనించాలి.

సాయందేవుని వంశానికి చెందిన గంగాధరసరస్వతి ప్రస్తుత గురుచరిత్ర వ్రాసేనాటికే వేరొక గురుచరిత్ర గ్రంథముండేదని తెలుస్తుంది. నామ ధారకుడికి సిద్ధయోగి దానిని చూపినట్లు శ్రీ గురుచరిత్రలో చూస్తాం. అంతేగాక యీ గ్రంథంలో "నా తండ్రి శ్రీ గురుచరిత్ర శ్రవణాసక్తుడు" అని వ్రాసాడు. అయితే అది తానే కూర్చొనని గూడ చెబుతాడు. అంటే ప్రస్తుత గురుచరి యితడు కూర్చినదన్నమాట. కేవలం సాధువుకుండవలసిన నిరహంకారం వల్లనే అది తన రచనగా యెక్కడా చెప్పుకోలేదు. అది వ్రాతప్రతిగా వారిదగ్గరే వుండేది. కారణం శ్రీగురులీలల పానమే తమకు అన్నపానీయాలని ఆయన ఒకచోట శ్రీ గురుచరిత్రలో అంటారు.

ఇదిగాక శ్రీగురుడు గోకర్ణంలో వుండేనాటికే ఒక సంక్షిప్తమైన గురుచరిత్ర వుండేదని, శ్రీగురుడు ఏకాంతంలో వున్న సమయంలో వారి దర్శనానికి వచ్చిన భక్తులకు సిద్ధయోగి దానిని వినిపిస్తుండేవారనీ ఒక జనవాక్యమున్నది. కొందరు పరిశోధకులు గూడ యిలానే వ్రాశారు. అంటే శ్రీగురుడు శ్రీశైలంలో అంతర్ధానమయ్యేనాటికే ఒక శ్రీగురుచరిత్ర గ్రంథమున్నట్లు, శ్రీగురుడు అంతర్ధానమయ్యే ముందు చెప్పిన మాటలు సూచిస్తున్నాయి. అంటే సద్గురువు యొక్క లీలలను, బోధనలను, పారాయణ, శ్రవణము, చింతనము చేయడమన్నవి ఉత్తమ సాధనంగా శ్రీగురుడే తమ భక్తులకు, శిష్యులకూ విధించినట్లు స్పష్టమవుతుంది. అందుకే తర్వాతి దత్తాత్రేయుని పూర్ణావతారమైన శిరిడీసాయిబాబా గూడ తమ చరిత్ర పారాయణ ఉత్తమ సాధనగా నిర్ణయించే, దాసగణుచేత హరికథల రూపంలో తమ లీలలు గానం చేయనిచ్చారు. అన్నా సాహెబ్ దబోల్కర్ (ఉరఫ్ హేమాద్రిపంతు)కు ఆయన **"శ్రీసాయి సచ్చరిత్ర"** వ్రాయడానికి అనుమతినిచ్చి ఆశీర్వదించారు.

శ్రీగురుని కాలంలోనే రూపొందిన ఒక సంక్షిప్త గురుచరిత్ర సాయం దేవుడు కన్నడభాషలో గూడ వ్రాసాడని ఎందరో పండితులంటారు. అంతేగాక నరకేసరి, నందిశర్మ, నరహరి వంటి కవీశ్వరులు గూడ శ్రీగురుని లీలలను కీర్తించి రచనలు చేసారు.

మనదేశంలో గ్రంథముద్రణ అమలులో లేనప్పుడు “శ్రీ గురుచరిత్ర" వ్రాతప్రతులుగా ప్రచారమయ్యేది. అటువంటి వ్రాతప్రతులు యిప్పటికీ యెన్నో భక్తుల కుటుంబాల వద్ద వున్నాయి. కాని వీరిలో ఎక్కువమంది, ఆ వ్రాతప్రతులను పరమ పవిత్రంగా పూజలో వుంచుకొని, నేడు ముద్రించబడే గ్రంథాలను మాత్రమే పారాయణకు ఉపయోగిస్తారు. శ్రీగురుని నుండి ప్రత్యేకమైన సందేశమొస్తే దప్ప ఆ వ్రాత ప్రతులను తీసిచూడరు, యితరులకు చూపరు. ఇటువంటి రెండు కుటుంబాల వారికి తగిన సందేశం లభించినందువలన తమవద్దనున్న వ్రాతప్రతులలోని అంశాలు కొన్ని శ్రీగురుని అనుగ్రహం వలన నాకు లభించాయి. వీటిని యీ మూడవ ముద్రణలో

పొందుపరుస్తున్నాను. అలనాడు శ్రీగురుని ప్రత్యక్షంగా సేవించిన భక్తులకు, భక్తురాంద్రకూ మహారాష్ట్ర దేశాచారాన్ననుసరించి రెండేసి పేర్లు వుండేవి. వారి అనుభవాలు శ్రీగురుచరిత్రలో వ్రాయబడినప్పుడు కొన్నివ్రాతప్రతులలో ఒక పేరు, మరికొన్ని వ్రాతప్రతులలో మరొక పేరూ వ్రాసారు. మన యీ ముద్రణలో యీ రెంటినీ ప్రస్తావించాను.

అన్నింటికంటే ముఖ్యమైన విషయాలు రెండున్నాయి. వెనుకటి వ్రాత ప్రతులలో ముఖ్యమైనదొకటి గాణాపురం ప్రాంతంలోనే ఒక సదాచార సంపన్నమైన కుటుంబం వద్ద వుండేది. ఒకప్పుడు ఖేడ్గాఁవ్బేట్ (పూణే వద్ద)లో సిద్ధపురుషుడుగా ప్రసిద్ధికెక్కిన శ్రీనారాయణ్ మహరాజ్ గారు చిన్న వయస్సులోనే గాణాపూర్ వద్దనున్న సంగమానికి వచ్చి, చాలాకాలం శ్రీదత్తానుగ్రహం కోసం తపస్సు చేసారు. ఒకనాడు శ్రీగురుడు ఆయనకు స్వప్నదర్శనమిచ్చి, పైన చెప్పిన సద్బ్రాహ్మణ కుటుంబంనుండి వారివద్దనున్న ప్రాచీన వ్రాతప్రతిని పొందమని ఆదేశించారు. అదేరాత్రి ఆ కుటుంబీకులకు గూడ శ్రీగురుడే దర్శనమిచ్చి, అతని వద్దనున్న వ్రాతప్రతిని నారాయణ్ మహరాజ్ కు యివ్వమని ఆదేశించారు. ఆ రీతిన లభించిన ఆ వ్రాతప్రతి శ్రీ నారాయణ్ మహరాజ్ వద్ద జీవితాంతమూ వుండేది. శ్రీ గురుని నుండి వారికెట్టి ఆదేశమూ రానందువలన ఆ వ్రాతప్రతిని ఆ మహాత్ముని దేహంతో పాటు వారి సమాధిలో పెట్టేసారు. అరుదుగా దానిని శ్రీమహారాజ్ గారికి చదివి వినిపించే అదృష్టం కలిగిన ఒక భాగ్యశాలి నుండి రెండు విషయాలు తెలియ వచ్చాయి: ఆవ్రాతప్రతిలో చివరి అధ్యాయంగా "శ్రీగురుగీత", భాగవతం ఏకాదశ స్కంధంలో శ్రీకృష్ణుడు ఉద్ధవునికి చెప్పిన అవధూతోపాఖ్యానం గూడ వున్నాయనితెలిసింది. అటువంటి వ్రాతప్రతుల ఆధారంగానే శ్రీవాసుదేవానంద సరస్వతీస్వామి తాము వ్రాసిన "శ్రీసంహితాయన గురుద్విసాహస్ర" అనే గ్రంథంలో యీ అవధూతోపాఖ్యానం పొందుపరచారు. ఇది మనకు యీనాడు లభించే ముద్రితమైన శ్రీగురుచరిత్ర గ్రంథాలలో కన్పించదు. ఈకారణంగానే శ్రీ గురుచరిత్రలోని అధ్యాయాల సంఖ్య 51 అని కొందరు, 52 అని కొందరు, 53 అని కొందరు తలచడానికి కారణం అయింది.

అందువలన యీ మూడవ ముద్రణలో అవధూతోపాఖ్యానం అను బంధంగా ముద్రించడమయింది. ఆ వ్రాతప్రతిలో "శ్రీగురుగీత" గూడ వుండడం వలన శ్రీగురుని భక్తులకు అదెంతో విలువైనదని స్పష్టమవుతున్నది. అంతేగాదు, శ్రీగురుని వంటి మహనీయుడు మాత్రమే నిజానికి గురువనదగిన వారని, ముముక్షువులు అట్టి వారిని మాత్రమే శ్రీ గురుగీతలో చెప్పిన విధంగా ఆశ్రయించి సేవించాలనీ స్పష్టమవుతుంది. అర్హతలేని వారి వద్ద మంత్రోపదేశం పొందడం యెంతటి అనర్థమో యీ "శ్రీగురుచరిత్ర" చెబుతుంది. అందువలన త్వరలో "శ్రీగురుగీత" గూడ - పెక్కు వ్రాతప్రతులను పరిశోధించి, తాత్పర్యంతో కలిపి ముద్రించనున్నాము. ఇంకొక ముఖ్యాంశం వున్నది-

శిరిడీ సాయిబాబా భక్తులకు "శ్రీగురుచరిత్ర" పారాయణ యెంతో అవసరం. హరివినాయక్ సాఠే, అన్నాసాహెబ్ దభోల్కర్ వంటి వారికి శ్రీసాయిబాబా దర్శనము, అనుగ్రహము లభించడానికి "శ్రీగురుచరిత్ర" పారాయణమే కారణమయింది. కుశాభావు

అనే భక్తుడి విషయంలో యీ సత్యం యింకెంతో స్పష్టంగా కన్పిస్తుంది. అతడిచేత యీ గ్రంథాన్ని 108 సార్లు పారాయణ చేయించడంలో సాయినాథుడు దీనికెంత ప్రాముఖ్యమిచ్చారో తెలుస్తుంది. ఆయన మహాత్ములందరిలోకి తలమానికము, కోహినూర్ వంటి వారైనప్పటికీ తాను సద్గురువునని చెప్పక, అతి సామాన్యుడిలా జీవించారు. భక్తులు తమను గురువుగా యెలా సేవించాలో యెన్నడూ చెప్పలేదు. భగవద్గీతా శ్లోకాన్ని వివరించినప్పుడు ఆ విషయమై రత్నాల్లాంటి మాటలు ఒకటి రెండు మాత్రమే చెప్పారు. అందుకే ఆయనను ఆ రీతిన సేవించడానికి యెవరూ ప్రయత్నించలేదు. ప్రయత్నించిన కొద్దిమందీ గూడ చేయలేకపోయారు. అలాగాక, గురుచరిత్రలో శ్రీగురుడు యెన్నో ' పురాణోపాఖ్యానాల సహాయంతో యీ విషయం వివరించారు. అంటే భక్తులు యెలా శ్రీసాయిని సేవించాలో "శ్రీగురుచరిత్ర" నుండి నేర్చుకోమని శ్రీసాయి సూచించారన్నమాట.

అంతేగాక, శ్రీగురునికి - సాయిబాబాకు సన్నిహితమైన పోలికలు యెన్నో వున్నాయి. జన్మించిన క్షణంనుండే యీ యిద్దరికీ తాము యెవరో తెలుసు. ఇద్దరూ లోకహితం కోసం అవతరించిన భగవత్స్వరూపులే. అయినప్పటికీ సత్సంప్రదాయాన్ననుసరించి ఇద్దరూ బాహ్యంగా గూడ ఒక గురువును ఆశ్రయించారు. శ్రీగురుడు శ్రీశైలంలో అంతర్థానమయినప్పుడు తమ శిష్యులకు పూలు ప్రసాదంగా అందజేసి, వాటిని ప్రాణప్రదంగా వుంచుకోమని చెప్పారు. సాయిబాబా తమ గురువు ప్రసాదించిన ఇటుక రాయిని అలానే పవిత్రంగా వుంచుకున్నారు. అది విరిగిపోయిన కొద్దికాలానికే ఆయన గూడ శరీర త్యాగం చేసారు. ఆయన తమను తమ గురువు ఒక బావిలోకి తలక్రిందులుగా వ్రేలాడదీసినట్లు చెప్పారు. గురుచరిత్రలో దీపకుడు, ఉపమన్యువు మొ ॥ న వారు చేసిన గురుసేవా విధానమంతా ఆ ఒక్క వాక్యానికి వివరణ అని తలచవచ్చు. శ్రీగురుడు యెంతోకాలం సన్యాసాశ్రమ ధర్మాన్ననుసరించి దేశసంచారం చేస్తూ లోకుల దృష్టినుండి గుప్తంగా వుండిపోయారు. ఒక్క నర్సోబావాడిలోనే 12 సం ॥ లు తపోనిష్ఠలో వున్నారు. శ్రీసాయి గూడ శిరిడీలో వేపచెట్టు క్రిందనున్న భూగృహంలో 12 సం ॥ లు వున్నారు. అందుండి బయటకు వచ్చాక గూడ సుమారు 30 సం ॥ లు గుప్తంగా పిచ్చి ఫకీరులా మాత్రమే జీవించారు. శ్రీగురుడు, తాము లోకానికి వెల్లడి కావలసిన సమయమొచ్చాకనే గంధర్వపురం చేరి ప్రకటమయినట్లు, శ్రీసాయి గూడ చివరి 23 సం॥లలోనే వెల్లడి అయ్యారు. కాకుంటే సాయి నైష్ఠిక బ్రహ్మచారి గనుక, యావజ్జీవితమూ తమ గురు సన్నిధిలోనే వుండిపోయారు. కేవలం ఆ గురువు ఆదేశించడం వల్లనే భక్తులనుద్ధరించడానికి మొదట్లో ఆయన దేశసంచారం చేసారని తలచవచ్చు. శ్రీగురుడు సంగమానికి వెళ్ళి రావడం నిత్యమూ మహోత్సవంగా జరిగినట్లే, శ్రీసాయి రోజూ లెండీకి రావడం, రోజు విడచి రోజు చావడికి వెళ్ళడమూ గొప్ప ఊరేగింపుగా జరిగింది. కొద్దిలో చెప్పాలంటే, సాయి చరిత్రలో గురుస్థానం (వేపచెట్టు మూలం) నర్సోబావాడి వంటిది; లెండీవనమే సంగమం: ద్వారకామాయియే గంధర్వపురం. ఈ మహనీయులిద్దరూ తమ 16వ యేటనే బాహ్య ప్రపంచంలోనికి అడుగు పెట్టారు. ఇద్దరూ తమ భక్తులకు కవితాశక్తిననుగ్రహించి, వారికి బిరుదులు గూడా యిచ్చారు. శ్రీగురుడు ఒకనికి 'యోగీశ్వర్' అని మరొకరికి 'కవీశ్వర్' అని బిరుదులిస్తే- శ్రీసాయి ఒకరికి 'దాసగణు' అని, మరొకరికి 'హేమాద్పంత్' అని బిరుదులివ్వడమేగాక, జగేశ్వర్ భీష్మకు కవితాధారనిచ్చి 'సగుణోపాసన' వ్రాయించుకున్నారు. శ్రీగురుడు ఒక యవనరాజును అనుగ్రహించి

అతనినుండి పూజలందుకున్నారు. సాయి యవనులందరిచేతా సేవించ బడుతున్నారు. ఇద్దరిదీ భిక్షా వృత్తియే. ఈ యిద్దరూ కర్మ ఫలానికీ, జన్మ పరంపరలకూ యెంతో ప్రాముఖ్యమిచ్చారు. ఇలా ఆలోచించినకొద్దీ యింకెన్నో పోలికలు స్ఫురిస్తాయి. కనుకనే "శ్రీసాయిబాబా జీవిత చరిత్ర", "శ్రీగురుచరిత్ర" ఒకదానికొకటి వివరణమని చెప్పాలి. ఆ రెండూ ఒకే దత్తాత్రేయుని చరిత్రలో వేర్వేరు అధ్యాయాలు. **కనుక సాయి భక్తులందరికీ, "శ్రీసాయిబాబా జీవిత చరిత్ర", "శ్రీగురుచరిత్ర", "శ్రీగురుగీత"లు కలసి**

**ప్రస్థానత్రయము అనవచ్చు. ప్రస్థానత్రయమంటే సనాతనధర్మ మంతటికీ మూలమైన ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత.**



# దత్తస్తుతి - గ్రంథ స్తుతి

భగవంతుడు ఒక్కడే. ఒకప్పుడు ఆయన అనేకమవదలచాడు. అట్టి సంకల్పమే మాయాశక్తి. దానివల్లనే ఆయన ఈ విశ్వమంతా అయ్యాడు. ఇలా సర్వాన్నీ సృష్టించడం వలన ఆయననే బ్రహ్మ అనీ, ఈ విశ్వాన్ని పాలించడం వలన ఆయననే విష్ణువనీ, సకాలంలో సృష్టిలోని రూపాలను ఆయనే నశింపజేస్తుండడం వలన శివుడనీ అన్నారు. ప్రతి కల్పాంత ప్రళయానికి ముందు తరించకుండా వుండిపోయిన జీవులు మరల జన్మించి, అనుభవం ద్వారా పూర్వకర్మను రహితం చేసుకుంటూ ఈసారి ధర్మబద్ధంగా జీవించడం వలన మరలా కర్మకు బద్ధులుగాకుండా వుండే అవకాశమివ్వడానికే భగవంతుడు మళ్ళీ మళ్ళీ సృష్టిచేస్తుంటాడు. ప్రతిసారీ సృష్టితో జన్మకువచ్చే జీవులు కర్మబద్ధులవకుండా జీవించగలగడానికి మార్గం గూడా ఆ భగవంతుడే యేర్పాటు చేస్తాడు. అందుకే ప్రతిసారీ మొదట మహాయోగులైన సనకాది బ్రహ్మమానస పుత్రులను, తర్వాత మహర్షు లైన వశిష్ఠాది ప్రజాపతులనూ సృష్టిస్తాడు. మరల అటువంటి ఋషుల ద్వారానే వేదాలు, శాస్త్రాలు, సదాచారము అనేవి జీవులకు ప్రసాదిస్తాడు. ఈ విషయం నిత్యజీవితంలో అనుక్షణము గుర్తుంచుకొని, అటువంటి దీక్షతో మనము జీవించగలగడానికి సాధనంగానే మనము గోత్రఋషులను ప్రతి కార్యానికి ముందు సంకల్పంలో భాగంగాను, పెద్దలను దర్శించినపుడు 'ప్రవర' చెప్పుకొనడం లోనూ స్మరించడం ఒక సదాచారంగా మహర్షులు నిర్ణయించారు.

అంతేగాదు అజ్ఞానం వలన జీవులు అనివార్యంగా చేసే దోషాలు ఎక్కువగా పేరుకొని, ఆ ప్రజలే ధర్మబద్ధంగా జీవించడానికి బాహ్యమైన ఆటంకంగా యేర్పడినప్పుడు దానిని తొలగించడానికి రాముడు, కృష్ణుడు వంటి అవతారాలు ఆ భగవంతుడే ఎత్తుతుంటాడు. కాని సృష్టి పొడుగునా అటువంటి అవరోధాలు సాధ్యమైనంత వరకూ రాకుండా చేయడానికి ఆ భగవంతుడే పరిపూర్ణులైన సద్గురువులుగా అవతరించి, తన లీలల ద్వారా సాధ్యమైనంతమందికి మోక్షేచ్ఛ, ధర్మనిష్ఠ కలిగేలా చేస్తూ వుంటాడు. ఇలా యెల్లప్పుడూ భూమిమీద పూర్ణులైన మహాత్ములుగా అవతరించే భగవత్తత్వాన్నే 'దత్తాత్రేయుడు' అన్నారు. భాషలను బట్టి ఆయనకు పేర్లు వేరుగావున్నా, ప్రపంచంలోని అన్ని మతగ్రంథాలలోనూ ఈ విషయం స్పష్టంగా చెప్పబడింది.

అంటే మనందరినీ సృష్టించడం వలన భగవంతుడే సర్వులకూ తండ్రి; తన నుండి యేర్పడిన పదార్థాలతోనే మనను పోషిస్తుండడం వలన ఆయనయే జగన్మాత. శాస్త్రాలద్వారా మనకు హితం చెబుతున్నాడు గనుక ఆయనయే మనకు మిత్రుడు. అధర్మాన్ని నిగ్రహిస్తుంటాడు గనుక ఆయనయే ప్రభువు. సద్గురువుగా అవతరించి మనలను అనుగ్రహిస్తాడు గనుక ఆయనయే గురువు. ఇలా ఆలోచిస్తే భగవంతుడే, తన బిడ్డలమైన మనకు నవవిధ భక్తులతో సేవచేస్తున్నాడు! చివరకు సద్గురువుగా మనకు ఆత్మసమర్పణ చేసుకుంటున్నాడు; దత్తం చేసుకుంటున్నాడు!! అందుకే 'దత్తుడు' అనే

పేరు అనుగ్రహమూర్తియైన భగవంతునికి అన్నింటికంటే - చక్కగా సరిపోతుంది. సర్వశక్తిమంతుడైన ఆయన - శక్తి హీనులము, అల్పజ్ఞులము అయిన మనకు సర్వమూ ప్రసాదించడమే గాక, ఆత్మ సమర్పణం గూడ చేసుకొనడంలోని ఆయన వాత్సల్యాన్ని అర్థం చేసుకొని ఎల్లప్పుడూ గుర్తుంచుకొని, అందుకు తగినంతగా కృతజ్ఞతతో జీవించగల్గడమే మన పరమ కర్తవ్యము. ఇలా జీవించగల్గినప్పుడు మనకెంతటి ధన్యత కల్గుతుందో అలనాటి పురాణకథల నుండి నేటి మహాత్ముల అనుభవాల వరకూ అన్నీ మనకు తెల్పుతాయి. అలనాడు అత్రి అనే మహర్షి తపోమహిమచేత మూడు విధములైన (అధిభౌతికము,అధి దైవికము, ఆధ్యాత్మికము) తాపాలను తొలగించుకొని 'అత్రి' అయ్యాడు. ఆయన కామక్రోధాది దుర్గుణాలన్నింటికీ మూలమైన అసూయను జయించి 'అనసూయ పతి అయ్యాడు. అందుకు మెచ్చిన భగవంతుడు అతనికి పుత్రుడై దత్తాత్రేయుడుగా జన్మించాడు. చరిత్రలో గూడ అనన్యంగా ఆయనను కొలిచిన వారికెందరికో ఆయన దత్తమై, వారిని తన ప్రతిరూపాలుగా రూపొందించి కృతార్థులను చేశాడు. అందుకే ఆ సేతు హిమాచల పర్యంతమూ దేశమంతటా నాటినుండి నేటివరకూ భక్తులందరూ గురుధ్యాన శ్లోకం చదువుకొని త్రిమూర్త్యాత్మకుడైన ఆ దత్తాత్రేయుణ్ణి · స్మరిస్తున్నారు.

సర్వజీవులనూ వుద్ధరించడమే తన అవతార కార్యంగా గల దత్తాత్రేయుడు చతుర్యుగావతారమని యోగీశ్వరుడైన చక్రధరుడు 'సూత్రపాఠ విచారము అనే గ్రంథంలో కీర్తించారు. రామ, కృష్ణాది అవతారాలకంటే ముందే ఒకానొక వైశాఖ బహుళ దశమీ గురువారంనాడు, రేవతీ నక్షత్రయుక్త మీన లగ్నంలో, మీనాంశ యందు దత్తుడు అవతరించారని పురాణాలు చెబుతున్నాయి. ఈయన కార్త వీర్యార్జుననకూ, ప్రహ్లాదునికి యోగముపదేశించి కృతార్థులను చేసినట్లు పురాణాలు చెబుతున్నాయి. ఈయన యిప్పటి నేపాల్ ప్రాంతంలోని చిత్రకూటం వద్దనున్న 'అనసూయా పహాడ్' అనేచోట మొదట అత్రి పుత్రుడుగా అవతరించారు. అందుకు గుర్తుగా యిప్పటికీ అక్కడ ఒక దత్తమందిరమున్నది. ఈయన తన అవతారం చాలించకుండా నేటికీ నీలగిరి శిఖరాన సూక్ష్మరూపంలో నివసిస్తుంటా డని మహనీయులు చెబుతారు. ఈయన ఎందరో మహనీయులకు అనుభవ గోచరుడవుతూ వున్నారు. ఈయన 'వాతరశన' అనే ఋషి సాంప్రదాయానికి చెందినవాడని, మౌనప్రియుడని పరిశుద్ధ హృదయుడనీ భాగవతం చెబుతుంది. ఈ సాంప్రదాయం వారు శాంతులు, అమలులు, సన్యాసులు, బ్రహ్మజ్ఞానులు అని భాగవతం (11 : 647) చెబుతుంది. వీరు యోగ సాంప్రదాయకులని నారద పరివ్రాజకోపనిషత్తు చెబుతుంది. దత్తాత్రేయుడు ఎక్కువగా కావేరీ లోయలలో తిరుగుతూ, పురాణాలలో 'సహ్యాద్రి'గా ప్రఖ్యాతమైన పర్వతగహ్వరాలలో ఆశ్రమాన్ని నెలకొల్పి, అక్కడ యోగ నిష్ఠలో నిమగ్నులయ్యారని మార్కండేయ పురాణం (17-12; 16-20) చెబుతున్నది. ఈయన యొక్క ఉపాసన గురించి స్కాంద పురాణంలోని కాశీఖండంలో వర్ణించబడింది. ఆగమ, తంత్ర, యోగ, పురాణాది ప్రాచీన గ్రంథాలలో శివుని అవతారంగా కీర్తించబడిన గోరక్షనాథుడు 'నాథ' సాంప్రదాయానికి పట్టుకొమ్మ అనవచ్చు. ఈయన కీర్తి భారతదేశంలోనే గాక, హిమాలయాలలోని వివిధ రాజ్యాలలోనూ, చివరకు ఆఫ్ఘనిస్తాన్ వరకు గూడ వ్యాపించినది. ఈ గోరక్షనాథునికి దత్తాత్రేయుడు దర్శనమిచ్చారని, ఆ యిద్దరికీ మహాద్భుతమైన సంవాదం జరిగిందనీ, నాథ సాంప్రదాయానికి చెందిన ముఖ్య గ్రంథాలలో ఒకటైన "గోరక్షవాణి" చెబుతున్నది. అంతేగాక, శ్రీ దత్తాత్రేయుడే

“అవధూతగీత” మరియు “శ్రీగురుగీత” స్వయంగా గోరక్షనాథునికి బోధించినట్లు, శివాజీ చక్రవర్తికి గురువైన సమర్థ రామదాసస్వామి తమ “దాసబోధ” లో వ్రాశారు. అందుకే నాథ సాంప్రదాయంలో శ్రీదత్తాత్రేయుడు పరమగురువుగా కీర్తించబడ్డారు.

శ్రీ దత్తాత్రేయునికి 'అవధూత' అనే బిరుదున్నది. దానికి అర్థం 'అవధూతోపనిషత్తు' యిలా వివరించింది -

శ్లో ॥ అక్షరద్వాద్వరేణ్యత్వాద్ధూత సంసార బంధనాత్

అంటే తత్త్వమస్యాది లక్ష్యత్వాదవధూత ఇతీర్యతే ॥

తా ॥ నాశరాహిత్యము, శ్రేష్ఠత్వము, విదిలించి వేయబడిన సంసార బంధము, 'తత్త్వమసి' అనే మహావాక్యానికి లక్ష్యమవడం వలన, అట్టివారిని 'అవధూత' ' యని చెబుతారు.

శ్రీ గోరక్షనాథుడు తన 'సిద్ధాంతపద్ధతి' అనే గ్రంథంలో యిచ్చిన అవధూత వర్ణన (6:1) - మార్కండేయ, భాగవతాది పురాణాలలోని దత్తాత్రేయ వర్ణనకు సరిపోతుంది. గోరక్షనాథుడు యిలా వ్రాశారు: “యోగులలో యెవరు అవధూతలని చెప్పబడుదురో యిచట తెల్పబడుచున్నది : (‘ధూమ్' అని ధాతువు) సర్వ ప్రకృతి వికారాలను విదిలించి వేయుట; దేహము మరియు యింద్రియ విషయాల యందు తగుల్కొన్న మనస్సును ఉపసంహరించి ఆత్మయందు లీనం చేసినవారు: నిష్ప్రపంచులు; ఆది మధ్యాంత భేదరహితులు ఇట్టివారే అవధూతలు. ఒక " మహాత్ముడు చెప్పినట్లు, "లోకంలో శ్రీకృష్ణుణ్ణి, వారి అంశావతారమైన శ్రీ చక్రధరులనూ కీర్తించేవారూ, నిరసించేవారూ గూడ వున్నారు. తరువాత అంశావతారమైన శ్రీ గోవింద ప్రభువులను కీర్తించేవారు, తటస్థులూ మాత్రమే వున్నారు. కాని శ్రీ దత్తప్రభువులకు మాత్రం సర్వత్రా, సర్వదా సన్మానమే వున్నది. ఇది ఈ అవతారానికి గల మరొక విశేషం".

**చారిత్రకమైన - కాలంలో గూడ** శ్రీ దత్తాత్రేయుడు ఎందరెందరో **మహాత్ములను అనుగ్రహించి** వారిచేత కీర్తించబడ్డారు. మహాయోగియైన జ్ఞానేశ్వరుడు ఒక ‘అభంగ'లో స్వయంగా యిలా కీర్తించాడు: “మేరువుకు అవతల (దక్షిణ దేశంలో) ఖేచరీముద్రలో కూర్చున్న నిరాకారుడైన దత్తయోగి ధ్యానంలో గాఢంగా నిమగ్నుడై బ్రహ్మానందమనుభవిస్తున్నాడు. నిస్సంగుడైన ఆయనకు తమ దేహంపైనగాని, వస్త్రాలమీదగాని అపేక్షయే లేదు. ఆయన గోదావరీ తీరంలో జ్ఞానాన్ని అపారంగా సేకరిస్తూ, పాంచాలేశ్వర్లో నిత్యమూ స్నానం చేస్తుండే శ్రీ దత్తయోగి, జ్ఞానదేవుడనైన నా హృదయంలో వున్నారు." మహ మహితాత్ముడై తుకారాము ఆయననిలా కీర్తించాడు: "శ్రీ దత్తాత్రేయమహరాజా! నీ అవధూత మూర్తియే నా జీవితానికి విశ్రాంతి. నీ అండలేక ఈ జీవిత రహస్యాన్ని ఎవరు " విప్పగలరు?" ఈ మహాత్ముడే దత్తప్రభువు గురించి, "ఆయన-సుఖాలను మనకు విడిచి, భక్తుల బాధలను తాననుభవిస్తాడు అన్నాడు. మనమింతకు ముందు ప్రస్తావించిన చక్రధరునికి మాతాపూర్లో ఒకసారి, పైఠానులో ఒకసారీ దత్తస్వామి దర్శనమిచ్చి, సన్యాసదీక్షా వస్త్రాలు, జీవులనుద్ధరించమని ఆదేశమూగూడ యిచ్చారు. తర్వాత ఆయనయొక్క అనుగ్రహంతోనే బాయిాశుడు, నాగదేవా 'చార్యులు అనే శిష్యులకు యోగసిద్ధి లభించింది. అందుకే "ఆయన దర్శనం అమోఘమైన ఫలితం గలది" అని, "ఈ (మహానుభావ) సాంప్రదాయానికి శ్రీ దత్త ప్రభువే ఆదికారణుడు” అనీ చక్రధరుడు

వ్రాశాడు. (విచార వచనము : 285) ఇలాగే సమర్థ సాంప్రదాయ ప్రవర్తకులైన శ్రీ సమర్థ రామదాసస్వామి, ఆయన శిష్యుడైన దినకరస్వామి గూడ దత్తస్వామిని సిద్ధపురుషులని కీర్తించారు. శ్రీ సమర్థుల ముఖ్య శిష్యులైన కల్యాణస్వామి, "దత్తప్రభువుకు ముల్లోకాలలోనూ వందనములే. ఆయన భిక్షాన్నమే గ్రహిస్తారు. ఆయన చుట్టూ సుందరమైన తేజః పుంజముంటుంది. ఆయన దిగంబరి, సిద్ధసనాతనుడు, త్రిమూర్తుల అవతారము, త్రిపురారి. నిత్యము భాగీరధీ తీరంలో నిత్యనియమాలు, కరవీరం (ఈనాటి కొల్హాపూర్) లో భిక్ష చేస్తారు. ఆయనది నిగూఢమైన యోగలీల. ఎన్నో ప్రాచీన సాంప్రదాయాలవారు ఆయనను ధ్యానిస్తారు. ఆయన గిరినార్ పర్వతంపై వుంటారు. ఈ శ్రీగురురాజు మహాదయామయుడు, కల్యాణ్కు సుఖాన్ని చేకూర్చేవాడు." ఆనంద సాంప్రదాయానికి గూడ మూల పురుషుడు శ్రీ దత్తుడేనని శ్రీధరస్వామి, శ్రీ కృష్ణ దయార్ణవ స్వామి చెప్పారు. అలానే, చైతన్య సాంప్రదాయ ప్రవర్తకులైన రాఘవ చైతన్యుడు, కేశవ చైతన్యుడు గూడ దత్తప్రభువును పరమగురువుగా చెబుతారు.



# శ్రీ దత్తాత్రేయుని షోడశావతారములు :

శ్రీ దత్తాత్రేయ సాంప్రదాయంలో కలియుగానికి ముందు స్వామికి పదహారు అవతారములని చెప్పబడినది. అయితే ఆయన తన పరతత్త్వంతో నిత్య భూలోక నివాసం చేస్తాడు గనుక మహర్షులకు ఆయన ప్రసాదించిన సగుణ సాక్షాత్కారాలనే ఆయన యొక్క అవతారాలని కీర్తించారని మనం గమనించాలి. వాటిని గురించి శ్రీవాసుదేవానంద సరస్వతీస్వామి తమ 'దత్త పురాణము'లో వర్ణించారు. దాని సారాంశాన్నిక్కడ పొందుపరుస్తాను.

## 1) యోగిరాజు లక

**అద్వయానన్ద రూపాయ యోగమాయా ధరాయచ ।**

**యోగిరాజాయ దేవాయ శ్రీ దత్తాయ నమోనమః ॥**

నారాయణోద్భవుడైన బ్రహ్మ తన తపస్సుచేత అత్ర్యాదులను సృష్టించి, 'సృష్టి విస్తరణ చేయమని అత్రి అనసూయలనాజ్ఞాపించాడు. ఆ ఋషి దంపతులు ఋక్ష పర్వతంమీద తపస్సు చేస్తుండగా ఒక కార్తీక పూర్ణిమ బుధవారం నాడు మొదటి ఝామున మొదటి యామంలో యోగి రాజుగా అవతరించాడు.

ఈనాడు యోగిరాజును మూడు అ అర్ఘ్యాలతో పూజించి, కొబ్బరికాయ నైవేద్యమిచ్చి, యోగిరాజు మంత్రాన్ని జపించి స్తోత్రాలు, లీలాగానము చేయాలి.

## 2) అత్రివరదుడు:

అత్రి వాతాశనుడై ఇంద్రియాలను, మనస్సునూ నిగ్రహించి, ఒంటికాలు పై యోగిరాజును ధ్యానించాడు. యోగిరాజువంటి బిడ్డను కనాలని ఆయన సంకల్పం. బిడ్డనుకనాలని ఆయన శిరస్సునుండి వెడలిన యోగాగ్ని ముల్లోకాలనూ తపింప చేయగా దేవాసురులు త్రిమూర్తులను శరణువేడారు. ముమ్మూర్తులూ అత్రి ఆశ్రమానికి వచ్చి ఆయనను మేల్కొలిపారు. ఆయన ముమ్మూర్తులను పూజించి, 'నేను . ఒక్కరిని ధ్యానిస్తే ముమ్మూర్తులూ వచ్చారేమి?' అన్నారు. “నీవు ధ్యానించిన అద్వితీయుని రూపాలమే మేము. ముగ్గురమూ ఒక్కటే. సృష్ట్యాది కార్యాలు నెరవేర్చడానికి త్రిగుణాల నాశ్రయించి ముమ్మూర్తులుగా వెలిశాము. నీవు ముందు చూచిన రూపాన్నే ధ్యానించు" అన్నారు. అపుడు యోగిరాజు త్రిగుణాత్మకుడు, శుద్ధస్ఫటిక దీప్తిగల యోగాదేశకరుడుగా షడ్భుజాలతో దర్శనమిచ్చాడు. ఇది ఒక బహుళ పాడ్యమీ రోహిణీ నక్షత్రయుక్త గురువారమునాడు జరిగింది. మొదటి యామమున మొదటి ఘడియ. ధ్యానం:

శ్లో ॥ మాలా కమండలు ధర కరపద్మ యుగ్మే

మధ్యస్థ పాణి యుగళే డమరూ త్రిశూలే

యస్యస్త ఊర్ధ్వకరయోః శుభశంఖ చక్రే

ధ్యాయేత్తమత్రి వరదం భుజషట్క యుక్తం ॥

ఈయన దేహంలోని కుడి పార్శ్వము గురువు. ఎడమ పార్శ్వము **క్షకారాంత వర్ణాలు** భగవంతుడు. కుడిచేతిలో మంత్రాలకాధారమైన అకారాది కకారాంత **క్షకారాంత వర్ణాలు** గల 52 పూసల జపమాల. ఈ మాలలో సకల మంత్రాలూ బీజాలతో సహా వుంటాయి - ఇవి మందాధికారులైన భక్తులకోసం. డమరులో శృత్యాది శాస్త్రాలన్నీ మధ్యమాధికారుల కోసమున్నాయి. పై చేతిలోని చక్రము ఉత్తమాధికారులకు సత్వరం బంధ విచ్ఛేదము చేసి తన జ్ఞానతేజాన్ని వారికి ప్రసాదిస్తుంది. ఇవి కుడివైపునున్నవి. ఇది మోక్షప్రదమైన గురుతత్వం. అర్జంట్

ఎడమ చేతిలో జీవులకు కర్మఫలాన్నిచ్చే కర్మసూత్రమనే జలాన్ని కలిగిన కలశమున్నది. జీవులకన్నపానాదులు ప్రాప్తించడం దీనిపై నాధారపడి యున్నది.

మరొక చేతిలోని త్రిశూలముల కొనలు ఆచార, వ్యవహార, ప్రాయశ్చిత్తాలు; ధర్మార్థ కామాలని జీవులకిస్తాయి. సృష్టికి స్థిమితమిస్తాయి. మరొక చేతిలోని శంఖం నిత్యం ధ్వనిస్తూంటుంది. ఆ ధ్వని అపూర్వ, నిత్య, పరిసాంఖ్య విధులను సూచిస్తుంది. ఈ మూడింటితో గూడిన యజ్ఞవిధి వలన సృష్టి చక్రం ప్రవర్తిస్తుంది. సృష్టి పాలన జరుగుతుంది. ఇది భగవత్తత్త్వం.

మూడర్ఘ్యాలతో (పూజా వస్తువులతో) పూజించి, అరటి పండ్లు నైవేద్యమిచ్చి, ఆ రోజున స్తోత్రము, లీలాశ్రవణాలతో గడపాలి. లు డయ నేంద్రలు.

## 3) శ్రీ దత్తాత్రేయుడు :

శ్లో॥ దత్తాత్రేయం శివం శాంతమింద్రనీల నిభం ప్రభుమ్ ।

ఆత్మ మాయారతం దేవమవధూతం దిగంబరమ్ ॥

భస్మోద్ధూళిత సర్వాంగం జటాజూట ధరం విభుమ్ ॥

చతుర్బాహు ముదారాంగం దత్తాత్రేయం నమామ్యహమ్ ॥

అత్రి తపస్సుకు మెచ్చిన భగవంతుడు వరం కోరుకోమన్నాడు. "నీవంటి. కొడుకు కావాలి " " అన్నాడు ఋషి. మాట యిచ్చాను గదా అని, తనంతవాడు లేనందువల్ల, తనను తానే దత్తం చేసుకొన్నాడు భగవంతుడు. ఆరోజు శుక్రవారం, కార్తీక బహుళ విదియ, మృగశిరా నక్షత్రం, మొదటి ఝాముున మొదటి గంట. ఆయనయే జ్ఞాననిధి, యోగి జనవల్లభుడు, జగద్గురువు. ఆయనకాదంపతులు ప్రణమిల్లి తమ గర్భజనితుడైన బిడ్డ కావాలని, సాక్షాత్కరించిన రూపం భూమి పై నిలిచిపోవాలనీ కోరారు. అందుకని అత్రివరదుడు నిలచాడు. దత్తాత్రేయునికి మూడర్ఘ్యాల పూజ, చెరకు నివేదనాదులు చేయాలి.

## 4) కాలాగ్ని శమనుడు :

శ్లో॥ జ్ఞానానందైక దీప్తాయ కాలాగ్ని శమనాయ చ ।

భక్తారిష్ఠ వినాశాయ నమోస్తు పరమాత్మనే ॥

ఆశ్రమంలో ధ్యాననిష్ఠుడైన అత్రినుండి జనించిన యోగాగ్ని ఆయనను దహించబోయింది. దత్తుడు ఋషి శిరస్సు ప్రవేశించగానే కోటి చంద్రుల చల్లదనం కల్గింది. తెరచిన ఋషి కన్నులనుండి దివ్యకాంతి వెడలి ఋతుస్నాతయైన అనసూయ దేహంలో అందరి సమక్షంలో ప్రవేశించింది. అది మార్గశిరమాసం పూర్వార్థంలోని సప్తమి. గర్భ జ సప్తమి. గర్భస్థుడైన భగవంతుడు 9 దినాలను 9 మాసాలని తలచి మార్గశిర పూర్ణిమా బుధవారంనాడు మృగశిరా నక్షత్రంలో సాయంత్రం జన్మించాడు. సకల సృష్టి పులకించింది. జగత్ప్రభువపుడు చంద్ర, దత్త, దూర్వాసుల రూపంలో దర్శనమిచ్చాడు. త్రిమూర్త్యాత్మకుడైన బిడ్డడిని చూచి వారు పొంగిపోయారు. అనసూయాస్తన్యపానంతోనూ, జలక్రీడలతోనూ వారిని భగవంతుడు సంతోష **పెట్టాడు.**

మార్గశిర పూర్ణిమనాడు మూడర్ఘ్యాల పూజ, పంచామృత నివేదన బ్రాహ్మయిల భోజనము విధి.

## 5) యోగిజన వల్లభుడు :

శ్లో॥ యోగ విజ్ఞననాథాయ భక్తానందకరాయచ ।

దత్తాత్రేయాయ దేవాయ తేజోరూపాయ తే నమః ॥

కాలాగ్ని శమనులు అనసూయ గర్భాన జన్మించారని తెలిసి సిద్ధ, గంధర్వాదులు, యోగులు దర్శింపరాగా ఆయన బాల్యరూపాన్ని విడిచి తేజోమూర్తిగా దర్శనమిచ్చి దానిని ధ్యానించమన్నాడు. "నాకు జన్మ, కర్మ, గుణ, రూప, మాయ, నాశాలు లేవు. సర్వవ్యాపిని, ఈ మూర్తిని ధ్యానించి తరించండి" అన్నాడాయన. నాడు మార్గశిర పున్నమి, గురు వారము, మధ్యాహ్నము : అనాడు అర్ఘ్యం, ముత్యాలు, పంచభక్ష్యాలు సమర్పించి 'ఓమ్ యోగిజన వల్లభాయ నమః' అని జపం చేయాలి.

## 6) శ్రీ లీలా విశ్వంభరుడు

శ్లో॥ పూర్ణబ్రహ్మ స్వరూపాయ లీలా విశ్వంభరాయచ ।

దత్తాత్రేయాయ దేవాయ నమోస్తు సర్వసాక్షిణే ॥

బాల దత్తుడైన యోగిజన వల్లభులొకసారి అనసూయ వడిలో పాలు త్రాగుతుండగా అతివృష్టి మొ॥న ప్రకృతి వికారాల వలన పీడితులైన మానవులు, మునులు ఆయనను శరణు వేడగా ఆయన తన విశ్వరూపంనుండి యోగ లీలగా లీల వారికి వలసినవన్నీ ప్రసాదించాడు. ఒక్కొక్కసారి శిష్యులకు వేదము నేర్పేవాడు. ఒకప్పుడు ధ్యాననిష్ఠుడై యుంటాడు. ఒకప్పుడు తన యోగ మాయచేత యీ సంసారాన్ని అరణ్య రూపం ధరింపచేసాడు. అహంకారం పర్వతమైంది. కామము సింహము, క్రోధం సివంగి, మనస్సు సరస్సు, యజ్ఞాదులు వృక్షాలు అయ్యాయి. ఆ ఆ వృక్షాల నిండా పండ్లున్నాయి. "ఈ పండ్లు ఆశ గొల్పుతాయి గాని వివేచిస్తే అవి కోరదగినవిగాదు, వాటినీడగూడ విషపూరితమే. జలమూ అంతే, సుఖాన్ని కోరేవాడు వీటిననుభవించాలన్న భ్రాంతితో యిక్కడ నివసించ కూడదు." అన్నాడు. ఆ మాటలు లెక్కచేయక వారంతా వాటిననుభవించారు. ఆయన అదృశ్యుడయ్యాడు. వారంతా దారి తప్పి భయంతో భగవంతుని స్మరించి శ్రీ గురుచరిత్ర " ఈంతులయ్యారు. కాని మరలా వనముచేత భ్రాంతులై మరలా మరచారు. అప్పుడు వారి కళ్ళు తెరిపించేందుకు అరణ్యాన్ని అదృశ్యం చేయగా వారు దత్తుని ఎడబాసినందుకు దుఃఖపడనారంభించారు. ఆయన దర్శనమిచ్చాడు. వారాయనను వదలి కర్మాచరణకు వెళ్ళలేదు. వారి భక్తిని పరీక్షించడానికి ఆయన ఒక సరస్సులో మునిగి 100 సం॥ లున్నాడు. ఒక వనితను తోడ్కొని మద్యం సేవిస్తూ బయటకొచ్చాడు అయినా వారాయనను విడువలేదు.

ఇన్ని లీలలు చేసిన యీయనను శ్రీ లీలా విశ్వంభరుడంటారు. ఇలా యీయన ప్రకటమైనది పుష్య పౌర్ణమినాడు - పుష్యమీ నక్షత్రం, బుధవారం, సూర్యోదయకాలం. ఆనాడు యీయనను విధియుక్తంగా పూజించాలి.

## 7) సిద్ధరాజు :

శ్లో॥ సర్వ సిద్ధాంత సిద్ధాయ దేవాయ పరమాత్మనే ।

సిద్ధరాజాయ సిద్ధాయ మంత్ర దాత్రే నమో నమః ॥

అపుడు అదృశ్యుడైన లీలా విశ్వంభరుడు గుప్తంగా బదరికావనం చేరాడు. అక్కడ కఠోర తపస్సుచేత వివిధ సిద్ధులను పొందిన సిద్ధులెందరో అహంకార అగ్రహాలతో వాదులాడుకొంటున్నారు. వారు యీయన దివ్య రూపానికి చకితులై ప్రశ్నించగా తానొక అనామకుడనని, ఒక గురువు ఆశ్రయమును లేదని, కర్మనిష్ఠయే లేదని, చిత్తయోగమే తన సాధనయని, నిరంజనియే ముద్ర అనీ అన్నాడు. ధ్యానానికతీతమైనదే తన లక్ష్యమన్నాడు. దుర్లభమైన ఆనందమే మార్గమన్నాడు. అంతలో గగన మార్గాన పోతున్న వసురుద్రాదిత్యాది దేవతలు నిలవబడి అక్కడ దిగారు. సిద్ధులందరూ అది తమ తమ సిద్ధియేనని ప్రగల్భాలు పల్కారు. "వాధించకండి. ఎవరు మాట మాత్రం చేత వారిని పంపగలరో వారి సిద్ధియది" అన్నాడాయన. వారి ప్రయత్నం విఫలమై లజ్జాక్రాంతులవగానే ఆయన ఆజ్ఞతో వారు వెళ్ళారు. అప్పుడు వారు ఆయనను శరణు

పొంద్ 'మీ యోగాన్నీ, సిద్ధినీ యిచ్చి, పరుల సిద్ధిని రద్దుచేసే మంత్రముపదేశించ' మని కోరగా ఆయనలానే చేసారు. ఇలా సిద్ధిరాజుగా "ఆయన అవతరించిన రోజు మాఘ పూర్ణిమ, మఖానక్షత్రయుక్త గురువారము, వీరిని యథోక్తం పూజించాలి.

## 8) జ్ఞాన సాగరుడు :

శ్లో॥ సర్వత్రా 2 జ్ఞాననాశాయ జ్ఞానదీపాయచాత్మనే ।

సచ్చిదానంద బోధాయ శ్రీ దత్తాయ నమోనమః ॥

అజ్ఞానమే జీవులన్నింటినీ క్షోభింపచేస్తోందని తలచిన దత్తుడొక ఫాల్గుణ శుద్ధ దశమినాడు జ్ఞానిగా ప్రకటమయ్యాడు. నాడు పునర్వసూ నక్షత్రయుక్త రవివారం. ఆయన సిద్ధులనడుమ గాలిలో కూర్చుని కన్పించగా వారు తమ సి ఆయనను పడగొట్టచూచి విఫలులై శరణు పొందగా, "ఆకాశంనుండి పుట్టిన వాయువు ఆకాశాన్నేమీ చేయలేనట్లు, సర్వకారణుడైన నన్ను మీరేమీ చలింపచేయలేరు" అని చెప్పి తాను పూర్వముపదేశించిన మంత్రాన్ని జపించమని చెప్పి జ్ఞానాన్ని గూడ ఉపదేశించాడు. యథాక్తపూజ, మందిర నిర్మాణము వీధి.

## 9) విశ్వంభరావధూత:

శ్లో॥ విశ్వంభరాయ దేవాయ భక్తప్రియకరాయచ ।

భక్తప్రియాయ దేవాయ నామ ప్రియాయ తే నమః ॥

ఒకసారి ఒక వికృతరూపియైన అవధూతగా సిద్ధుల మధ్యకొచ్చి చూస్తే కొందరు ధ్యానస్థులై, కొందరు కలహాదులలో తగుల్కొని, కొందరు ధ్యానంలో చంచలులుగానూ వున్నారు. తన లీలలతో వారందరిని ఆత్మస్థులను చేసి మరలా విడవగానే వారు యోగభగ్నులయ్యారు. ఆయనను బాధింపజూచి, చేతగాక శరణుపొందారు. అపుడాయన తన విశ్వరూపాన్ని చూపాడు. నాడు చైత్ర పూర్ణిమ, చిత్రా నక్షత్రయుక్త మంగళవారం, రెండవ యామంలో రెండవ గంట, సహస్రాక్ష సహస్ర శిరస్కుడైన ఆయన తన మాయకు తానే ఆశ్రయమని, తాను నిర్గుణుడననీ చెప్పి భక్తులకభయమిచ్చాడు. అర్ఘ్యము, గోదానము యిచ్చి యీయనను పూజించాలి.

## 10) మాయాయుక్తావ ధూత :

శ్లో॥ మాయా యుక్తాయ శుద్ధాయ మాయాగుణహరాయ తే ।

శుద్ధబుద్ధాత్మరూపాయ నమోస్తు పరమాత్మనే॥

ఒక స్వాతీ నక్షత్రయుక్త వైశాఖశుద్ధ చతుర్దశీ బుధవారం మధ్యాహ్నం ఒక భిక్షు రూపంలో భిక్షకోసం శీలుడనే బ్రాహ్మణుడింటికి శ్రాద్ధ సమయంలో భిక్షకెళ్ళాడు. కౌపీనధారి, యువకుడు, ద్విబాహువు, దండ భిక్షా పాత్రధారియైన ఆయన ఆ యింట ప్రవేశించి పీటమీద కూర్చున్నాడు. కూడా నల్లని కుక్క వున్నది. శీలుడు తిరస్కారంగా ప్రశ్నలడిగి, సమాధానాలు విని శరణుపొంది, నెయ్యి, తేనె, పూలతో పూజించి, శ్రాద్ధాన్నమిచ్చి, తాంబూల ఆరతులిచ్చాడు. శ్రాద్ధభోక్తలు ఆగ్రహించి వెళ్ళిపోయారు.

పట్టణములోని బ్రాహ్మణులంతా కట్టుగా వచ్చి ఆయనను నిలదీసారు. “బ్రహ్మకర్మను భ్రష్టం చేస్తారా?” అన్నారు. ఆయన “బ్రహ్మ, కర్మ అంటే నాకు తెలియదు. ఆత్మ ఒక్కటే తెలుసు” అన్నాడు. వారు, “ఓంకారమే బ్రహ్మము. నిత్య నైమిత్తికమని కర్మలు ద్వివిధము. నీవు భ్రష్టుడవు గనుక వేదాలు వినరాదు” అన్నారు. "కుక్కవంటి సగుణమైన నిత్యనైమితకర్మలకనర్హుడనే. కారణం నేను మాయా రహితుడను. ఈ నా కుక్కకవన్నీ తెలుసు" అనగానే కుక్క వేదాలు, షట్శాస్త్రాలను చెప్పింది. శీలుడికి ఉపదేశించి ఆయన బయటకు వచ్చాడు. వారు శరణుపొంది అనుసరించారు. ఈయనను మూడు అక్ష్యాలు. పెరుగు, అన్నముతో పూజించాలి.

## 11) మాయాముక్తావధూత:

శ్లో॥ స్వ మాయాగుణగుప్తాయ ముక్తాయ పరమాత్మనే ।

సర్వత్రా2 జ్ఞాననాశాయ దేవదేవాయ తే నమః ॥

అవుడా, అవధూత అడవిలో ఆసనంపై ధ్యానన్నుడై కూర్చున్నాడు. బ్రాహ్మణులు చేరారు. ఆయన వారికి పెద్ద పులులు, నర్పాలు, అగ్నులు చూపినా వారు పారిపోలేదు. అపుడాయన తన మాయను విడిచి స్వాతీ నక్షత్రయుక్త గురువారము, జేష్ఠ శుద్ధ త్రయోదశిన సూర్యోదయమప్పుడు దర్శనమిచ్చాడు. ఆయన అంకంమీదనున్న స్త్రీని ముద్దాడుతూ మధ్య మాంస సంగీతాలతో ప్రొద్దుపుచ్చుతున్నాడు. బ్రాహ్మణులు ఆయన పతితుడని తలచి వెళ్ళిపోయారు. "ఆది బాగుందనుకున్నాడు. దత్తుడు. అయితే జంభాసురునితో యుద్ధంలో "పరాజితులైన దేవతలు బృహస్పతి సలహానుసరించి ఆయనను విడువక సేవించారు. ఆయన ఆజ్ఞపై రాక్షసులను యుద్ధానికి పిలచి, దత్తుని వడిలోని 'సుందరిని రాక్షసులపహరించుకొని పోతున్నపుడు దేవతలు వారిని సంహరించారు. లక్ష్మి మరలా ఆయన వడిలో చేరినది.

కార్తవీర్యార్జునుడు ఆయన మాయకు చలించక సేవించి దత్త భక్తియోగాన్ని నేర్చి 12 రోజులనుండి క్రమంగా మాసము, 3 మాసాలు, 6 మాసాలు, 1 సం॥ము యోగ సమాధిలో వున్నాడు. తర్వాత అతనిననుగ్రహించి స్వధర్మపాలన చేయించాడు దత్తుడు.

భూమిని నిక్షాత్రం చేయదలచిన పరశురాముని యోగసిద్ధుని చేసి ఆజ్ఞాపించగా అతడు స్వామి ఆజ్ఞపై పర్వతాన్ని బాణంతో కొట్టగానే సకల తీర్థాలూ వెడలివచ్చాయి. వాటిలో స్నానం చేసి తండ్రి జమదగ్నికి అగ్ని సంస్కారం చేసాడు పరశురాముడు. రేణుక సహగమనం చేసింది. మరుక్షణమే దత్తానుగ్రహంతో వీరిద్దరూ తమ తేజస్సుతో దిక్కులను వెలిగిస్తూ దర్శనమిచ్చారు. తర్వాత రాముడు భూమిని నికాత్రం చేసి వారి రక్తంతో అర్ఘ్యమిచ్చి, సోమయాగంచేసి, స్వామిని పూజించి, వరం పొంది పశ్చిమ సముద్రతీరాన తపస్సుకు వెడలిపోయాడు. యథా విధి మాయాముక్తావధూతను పూజించాలి.

## 12) ఆది గురువు :

సుబాహువు మొ॥న ముగ్గురు కొడుకులకు జ్ఞానియైన మదాలస జ్ఞానాన్ని బాల్యంలోనే బోధించి ముక్తులను చేసింది. భర్త ఆజ్ఞవలన అలర్కుడికి జ్ఞానోపదేశం

చేయక రాజ్యపాలనకు విడిచింది. అలర్కుడు ధర్మబద్ధ రాజ్యపాలనలో నిమగ్నుడయ్యాడు. అతడికి వివేకముదయింప చేయదలచిన అన్న సుబాహుడు కాశీరాజును ప్రేరేపించి దండెత్తేలా చేశాడు. అడవిలోకి పారిపోయిన అలర్కుడికి తల్లి గుర్తొచ్చి మెడలోని తాయత్తును తెరచి చూడగా ముముక్షువై సద్గురువునాశ్రయించడమే ఉత్తమమన్న ఆమె ఆదేశం కన్పించింది. సహ్యాద్రిలోని తపస్వియైన దత్తుని, ఆమలక వృక్షం క్రింద ఆషాడ పూర్ణిమయుక్త శనివారంనాడు దత్తాశ్రమంలో దర్శించాడు. దత్తుడతనికి ఆది గురువుగా దర్శనమిచ్చి ఆత్మ విచారాన్ని బోధించి తరింప చేసాడు. ఈయనను యథావిధి పూజించాలి.

## 13) శివరూపుడు :

శ్లో॥ సంసార దుఃఖనాశాయ శివాయ పరమాత్మనే ।

దత్తాత్రేయాయ దేవాయ నమోస్తు పరమాత్మనే ॥

దిగంబరుడు, ఆచారహీనుడు అయి వేదాలు చదువుతున్న దత్తుని ఒక బ్రాహ్మణుడు, "నీకు ఆశ్రమ ధర్మం లేదు. దిగంబరుడవు. స్త్రీ, మద్య లోలుడవేమి?" అన్నాడు. తాను అత్యాశ్రమినని చెప్పి దత్తుడు పింగళ నాగునికి సుందరము, శుభమూ అయిన శివరూపంతో దర్శనమిచ్చి అనుగ్రహించాడు : అది శ్రావణమాసం పూర్వార్థంలోని అష్టమి, సోమవారం. అభిషేకము. అర్ఘ్యసహిత పూజ విధి.

## 14) శ్రీ దేవ దేవ :

శ్లో॥ ఇంటడ అదర్ అki eds. సర్వాపరాధ 'నాశాయ సర్వపాప హరాయ చ ।

దేవదేవాయ దేవాయ నమోస్తు పరమాత్మనే ॥

దత్తుడు సహ్యాద్రి చేరి ఆమలక వృక్షం క్రింద ముని రూపంలో తపస్సు చేస్తుంటే సిద్ధాదులు మొదలు సర్వప్రాణులూ సహజవైరాన్ని మాని కలసి జీవించాయి. భాద్రపద పూర్వార్థంలోని చతుర్దశీ శతతారకా నక్షత్ర (శతభిష) ఆయనను యుక్త గురువారం మొదటి యామంలోని మొదటి గంటలో బ్రహ్మ దర్శించినపుడు, ఆయన శంకచక్ర గదా పద్మహస్తుడై దర్శనమిచ్చాడు.. ఆ దర్శనంతో ఆ దండకారణ్యాశ్రమంలో బ్రహ్మాది దేవతలందరూ దర్శనం చేతనే ముక్తులై ఆయనలో లీనమయ్యారు. మూడర్ఘ్యాలు, తాంబూలము విధి.

## 15) దిగంబరుడు :

సోమవంశజుడైన యదుమహారాజుకు దిగంబరుడు దర్శనమిచ్చి 24 మంది సాధక గురువులనుండి తాము నేర్చిన జ్ఞానాన్ని బోధించి ముక్తుని చేసినది ఆషాఢ పూర్ణిమ, బుధవారం, సూర్యోదయకాలంలో, యదువు అవధూతగా సంచరించాడు. దత్తానుగ్రహం వలన అతడి వంశంలో శ్రీకృష్ణుడు జన్మించాడు.

ఇలానే ప్రహ్లాదుడు గూడ ఆయననుండి జ్ఞానం పొంది తరించాడు.

కార్తవీర్యార్జునుడు ఆయన సేవవలన, స్మరణ వలన, వేదధర్ముడు నామజపంచేత; దీపకుడు ఆయన లీలాశ్రవణంచేత; విష్ణుధర్ముడు ఆయన పాదార్చనచేత; పరశురాముడు స్నేహభక్తిచేత తరించారు.

మూడు అర్ఘ్యాలు, వస్త్ర మాలాదులతో పూజ విధి.

## 16) శ్రీకృష్ణ శ్యామకమలనయనుడు :

శ్లో॥ అఖండాద్వైత రూపాయ నిర్గుణాయ గుణాత్మనే ।

కృష్ణాయ పద్మనేత్రాయ నమోస్తు పరమాత్మనే ॥

జ్ఞానతల్పం మీద విశ్రమించిన దత్తుని, శిష్యులు దర్శించినపుడు ఆయన కార్తీక పూర్వార్ధ ద్వాదశీ బుధవారం రేవతీ నక్షత్రంనాడు, సూర్యోదయ కాలంలో ఇంద్రనీల ప్రభతో దర్శనమిచ్చాడు. కనుక యీయన పేరు కృష్ణ శ్యామ కమలనయనుడు.

మూడు అర్ఘ్యాలు, యథాశక్తి బ్రాహ్మణ భోజనము విధి.

మనదేశంలో యిన్ని ఆధ్యాత్మ సాంప్రదాయాల వారిచేత పరమగురువుగా, మూల పురుషుడుగా కీర్తించబడిన దత్తస్వామి, చరిత్రలో యింకెందరు సాధకులనో అనుగ్రహించి, మహాత్ములుగా రూపొందించారు. అంతేగాక, ఈయన 13వ శతాబ్దంలో తూర్పుగోదావరి జిల్లాలోని పిఠాపురంలో రాజు-సుమతి అనే పుణ్య దంపతులైన తమ భక్తులను అనుగ్రహించి, వారికి పుత్రుడుగా అవతరించారు.

**ఆయనయే ఈ శ్రీపాద శ్రీ వల్లభులు, ఆయనే మరలా శ్రీ నృసింహ సరస్వతిగా రెండవసారి అవతరించారు. వీరిద్దరి దివ్యలీలలను వర్ణించినదే ఈ "శ్రీ గురుచరిత్ర".**



# “శ్రీ గురుచరిత్ర" - గ్రంథమాహాత్మ్యం

మహారాష్ట్ర దేశంలోని మార్గాంవ్ అనే గ్రామంలో గణేశభట్టు - రమాబాయి అనే పుణ్య దంపతులకు జన్మించాడు వాసుదేవశాస్త్రి. ఇతడు తన ఎనిమిదవయేట ఉపనయనమైన దగ్గరనుండి ఆదర్శ బ్రహ్మచారిగాను, వివాహమయ్యాక సదాచార సంపన్నుడైన గృహస్థుగాను జీవించాడు. గాయత్రీ అనుష్ఠానము, వేదాధ్యయనము, అగ్నిహోత్రము నిష్ఠతో ఆచరిస్తుండేవాడు. కేవలం వంశాచారంగా మాత్రమే మహారాష్ట్ర భాషలోని "శ్రీ గురుచరిత్ర" లాంఛనంగా నిత్య పారాయణ చేస్తుండే వాడు. తన తపశ్శక్తి వలన మానవులకు, పశుపక్ష్యాదులకూ గూడ వేద మంత్రోచ్చారణతో ఆరోగ్యం చక్కబరచడమేగాక, జ్యోతిశ్శాస్త్రంలో ప్రావీణ్యం గడించి, ఆర్తుల బాధలకు పరిష్కారం చెప్పి, ఆర్ష సాంప్రదాయ ప్రాశస్త్యాన్ని ప్రజలకు నిరూపిస్తూండేవాడు. ఉదాహరణకు, అతడొక రోగితో గోదానం చేయమని చెప్పాడు. ఆ గోవుపై ఆశతో వాసుదేవశాస్త్రికి తెలియకుండా అతని సోదరుడు ఆ దానం స్వీకరించి, వెంటనే జబ్బు పడ్డాడు. అపుడు

వాసుదేవశాస్త్రి తన తమ్ముణ్ణి మందలించి, రెండింతలు దక్షిణతో ఆ గోవును మరొక బ్రాహ్మణునికి దానమిప్పించి, అతనిని రోగ విముక్తుని చేసాడు. **తపోబలంతో యితరుల కర్మదోషాలను గూడ భరించగలవారే దానం స్వీకరించాలనేవాడు శాస్త్రి.**

ఇతనికి "శ్రీ గురుచరిత్ర" పారాయణ వలన దత్తానుగ్రహం అనుభవమవుతూండేది. ఒకనాడతడు ఒక అడవిలోనుండి వెళ్తూండగా దత్తస్వామి సీతారాంజుడియా అనే వ్యక్తి రూపంలో దర్శనమిచ్చి, అతనిని ఒక పులిబారినుండి రక్షించారు. నాటి రాత్రి దత్తస్వామి స్వప్న దర్శనమిచ్చి, ఆ రహస్యం బైటపెట్టారు. తర్వాత ఒకసారి అతడు నరసోబావాడి వెళ్ళాలనుకుంటుండగా, ఒకనాటి రాత్రి దత్తస్వామి స్వప్నంలో కన్పించి, "నీ తల్లి అనుమతిస్తుంది: ప్రయాణానికి అవసరమైన పైకము, తోడూ గూడ దొరుకుతాయి" అని చెప్పారు. నిజంగానే తెల్లవారేసరికి అన్నీ అలానే సమకూడడం వలన అతడు బయల్దేరి, దారిలో గోరేగాంలో బస చేసాడు. నాటిరాత్రి దత్తస్వామి మరలా స్వప్నంలో కనిపించి, నరసోబావాడిలో గోవిందస్వామి అనే సిద్ధపురుషుడున్నారని, ఆయనను దర్శించమనీ చెప్పారు. మరుసటిరోజు అతడు నరసోబావాడి చేరగానే, ఆ స్వామియే అతనికి యెదురై పేరు పెట్టి పిలిచి, అతని యోగక్షేమాలు విచారించారు. ఒకరోజు అచటి ఆలయ పూజారులు వాసుదేవుణ్ణి దత్తపాదుకలకు అభిషేకం చేయనివ్వలేదు. అపుడు దత్తస్వామి, ఆ సంగతి గోవిందస్వామికి తెలిపి, అతడు అభిషేకం చేసుకోవడానికి అనుమతి యిప్పించారు. మరొకరోజు అతనికి దత్తస్వామి కలలో కన్పించి, "శ్రీ గురుచరిత్ర" పారాయణ చేయమని ఆదేశించారు. అతనివద్ద ఆ గ్రంథం లేదని చెప్పగానే, మీరజ్లో వున్న శంకరభట్టు వద్ద ఆ గ్రంథం తీసుకోమని చెప్పారు. ఈ భట్టు తన పారాయణ గ్రంథం యెవరికీ యిచ్చేవాడు గాదు. కాని దత్తస్వామి కలలో కనపడి ఆదేశించడం వల్లనే అతడాగ్రంథం వాసుదేవశాస్త్రికి యిచ్చాడు. తర్వాత ఒకనాడు వాసుదేవశాస్త్రిని "శ్రీ గురుచరిత్ర" పారాయణే ముఖ్యసాధనగా చేసుకొమ్మని గోవిందస్వామి చెప్పారు. "నేను శిష్టాచారం ప్రకారం సూర్యుణ్ణి, అగ్నినీ సేవిస్తున్నాను గదా! ఇంకా అదెందుకు?" అన్నాడు. వాసుదేవశాస్త్రి. కాని నాటి రాత్రి స్వప్నంలో దత్తస్వామి అతనికి మంత్రోపదేశం చేసి అతనికి ప్రత్యక్ష గురువయ్యారు. తెల్లవారగానే అతనికి గోవిందస్వామి యెదురై, "రాత్రి నీకు ఉపదేశమైంది గదా?" అని చెప్పి, దాని అనుష్ఠాన విధానమంతా అతనికి బోధించారు!!

ఒకప్పుడు వాసుదేవశాస్త్రిని 7 సం॥లు కదలకుండా మార్గావ్లోనే వుండమని దత్తస్వామి ఆదేశించారు. అతడు ఒక దత్తమూర్తిని తీసుకు వెళ్ళదలచి కాగల్ అనే వూరు వెళ్ళాడు. అక్కడ బజారులో అకస్మాత్తుగా ఒక శిల్పి ఎదురై, ఒక దత్తమూర్తిని యిచ్చి, తనను ఆ స్వామియే అలా చేయమని ఆ ముందటి రాత్రి స్వప్నంలో ఆదేశించారని చెప్పాడు. శాస్త్రి మార్గావ్ చేరేసరికి అక్కడొక విధవరాలు అతనికి కొంచెం స్థలమిచ్చి "నిన్న నా భర్త కలలో కనిపించి, కొంత స్థలం ఒక సద్బ్రాహ్మణునికి దానమిమ్మని చెప్పారు" అని చెప్పింది. శాస్త్రి ఆ స్థలంలో ఒక దత్త మందిరం నిర్మించి, ఆ విగ్రహాన్ని అందులో ప్రతిష్ఠించారు. ఆ మందిరం లోని దత్తస్వామి పిలిస్తే పలికేవాడు. ఒక దత్త జయంతికి వాసుదేవ శాస్త్రిగారి బంధువొకరు మరణించారు. నాటి జయంతి కార్యక్రమానికి విఘ్నం కలుగుతుందని వెరిచి, ఆ సంగతి శాస్త్రిగారికి యెవరూ చెప్పలేదు. ఆనాడు అతడు

మందిరానికి వెళ్ళగానే దత్తస్వామి, "శివ శివ! నన్ను తాకవద్దు. నీకు మైల వచ్చింది" అన్నారు. అప్పుడు విచారిస్తే అసలు విషయం బైటపడింది. అలాగే, ఒక చంద్రగ్రహణమప్పుడు పంచాంగాలన్నీ ఆ ప్రాంతంలో గ్రహణం కనిపించదని చాటాయి. కాని ఆ ముందటి రాత్రి దత్తస్వామి శాస్త్రిగారికి దర్శనమిచ్చి, "రేపు గ్రహణం కనిపిస్తుంది. కనుక నాకు భిక్ష, నైవేద్యము వద్దు" అన్నారు. మరుసటిరోజు ఆ మాట అక్షరాలా నిజమైంది!

ఒకసారి వాసుదేవశాస్త్రి, అతని తల్లీ నరసోబావాడి చేరి ఒక ధర్మశాలలో విడిది చేసారు. నాటిరాత్రి దత్తస్వామి ఆ యిద్దరికీ కలలో కన్పించి, "ఈధర్మశాల శిథిలమైంది. వేరొకచోటుకు వెళ్ళండి" అని చెప్పారు. ఉదయమే శాస్త్రి స్నానసంధ్యలు పూర్తిచేసుకొని, తన తల్లిని తీసుకొని ధర్మశాలనుండి బయటకు రాగానే ఆ భవనం కూలిపోయింది. అలానే ఒకప్పుడు వాసుదేశాస్త్రి తన భార్యను తీసుకొని దత్తక్షేత్రాలు దర్శిస్తూ గంగాఖేడ్ చేరుకొన్నాడు. అక్కడ ఒకనాటి రాత్రి దత్తస్వామి అతనికి స్వప్నంలో కన్పించి, నేటినుండి నాల్గవ రోజున మీ యిద్దరినీ నా సన్నిధి చేర్చుకుంటాను" అన్నారు. శాస్త్రి "నేను సన్యసించాలి; కనుక మీరు ఆమెను మాత్రమే తీసుకుపోండి. " అన్నాడు. ఆమెకు మరురోజే కలరావచ్చి, కొద్దిరోజులలో మరణించింది. ఆమెకు కర్మచేసి, 14వ రోజున శాస్త్రి సన్యసించాడు. ఆ ముందటి రాత్రి దత్తస్వామి అతనికి గోవింద స్వామి రూపంలో స్వప్న దర్శనమిచ్చి ప్రణవముపదేశించి, మరుసటిరోజు నుండి భిక్షువుగా జీవించమని ఆదేశించారు. అంటే ఈయనకు అసలైన దీక్ష దత్తస్వామియే యిచ్చారన్నమాట! నాటి నుండి ఈయన శ్రీవాసుదేవానంద సరస్వతీ స్వామిగా ప్రసిద్ధికెక్కాడు. అటు తర్వాత ఈయన అతి కఠోరంగా తమ ఆశ్రమ ధర్మాలు పాటిస్తూ దేశ సంచారం చేసారు. ఎన్నో ప్రాంతాలలో మొత్తంమీద 24 చాతుర్మాస్యాలు చేసారు. వీరు తమ పాదయాత్రలో ఒకసారి, నాటి శృంగేరీ జగద్గురు శంకరాచార్యులైన శ్రీ నృసింహ భారతీస్వామి వారిని దర్శించారు. శ్రీ శంకరాచార్య వీరినెంతగానో సన్మానించి, తమ శిష్యులతో, **"అయంహి భగవాన్ సాక్షాత్ దత్తాత్రేయో స్వయం యతిః" - "ఈ యతి సాక్షాత్తూ దత్తాత్రేయుడే!"** అని చెప్పారు - ఒకసారి శ్రీవాసుదేవానందులు కాలినడకన గిరినార్చేరి, బాగా డస్సిపోయారు. అప్పుడొక గుజరాతీ శ్రీమంతుడు కొన్ని పూరీలు తెచ్చి యివ్వబోయాడు. ఆయన తమ ఆచారాన్ననుసరించి, వాటిని స్వీకరించలేదు. అప్పుడతడు, "నేనే కేవలం కర్మసన్యాసిగా వుంటే, నీవు మాత్రం అలా యెందుకుండవు?" అని గదమాయించి వెళ్ళిపోయాడు. ఆ రూపంలో వచ్చినది దత్తస్వామియేనని తర్వాత తెలిసింది.

శ్రీవాసుదేవానందులు దేశ సంచారం చేస్తున్నపుడు ఆంధ్రదేశంలో తిరుపతి, శ్రీకాళహస్తి, వెంకటగిరి, నెల్లూరు, శ్రీశైలం సందర్శించారు. ముక్త్యాలలో 1908లో చాతుర్మాస్యం చేసారు. తర్వాత హంసలదీవికి వచ్చి సాగరసంగమంలో స్నానం చేసారు. తర్వాత మచిలీపట్నం మీదుగా సప్తగోదావరిని సందర్శించారు. అక్కడ గోదావరినది వశిష్ఠ, కోటిలింగ, కౌశిక, వృద్ధ గౌతమి, భరద్వాజ, ఆత్రేయ, తురీయ అను ఏడు పాయలై సముద్రంలో కలుస్తుంది. తర్వాత రాజమండ్రి విచ్చేసి, అక్కడ నుండి పిఠాపురం చేరి, ఆ పట్టణ వాసులకు అక్కడ శ్రీపాద శ్రీవల్లభులు అవతరించారని చెప్పి, వారి జన్మస్థలం గూడ చూపి, అక్కడ దత్త పాదుకలు ప్రతిష్ఠించారు. తర్వాత కాకినాడ చేరి సముద్రస్నానం

చేసారు. మరలా రాజమండ్రి చేరి అచట శృంగేరి శంకరమఠంలో 'భక్త వత్సలుడు' అను పేర సం॥ 1910 ప్రాంతంలో దత్తమూర్తిని ప్రతిష్ఠించారు. చివరకు 1914 సం॥లో జ్యేష్ఠ బహుళ చతుర్దశినాడు ఆయన తన శిష్యులతో "రేపు రాత్రి అమావాస్య ఘడియలు వెళ్ళాక మేము శరీరము త్యజిస్తాము" అన్నారు. ఆ సమయానికి దత్తమూర్తి యెదుట ధ్యానంలో కూర్చుని పరమపదించారు. "శ్రీ గురుచరిత్ర" పారాయణ ద్వారా వీరిని దత్తస్వామి తమ ప్రతిరూపంగా రూపొందించడమేగాదు, వారి ద్వారా ఆయన మరొక అవతార మెత్తారు. ఆయన, "శ్రీ గురుచరిత్ర" లో కీర్తించబడిన శ్రీగురుడు గా అవతరించినపుడు చివరకు శ్రీశైలంలో అంతర్ధానమయ్యే ముందు "శ్రీ గురుచరిత్ర" గ్రంథం రూపంలో తామెల్లప్పుడూ వుంటామని ప్రమాణం చేసారు. ఒకప్పుడు ఆ గ్రంథాన్ని 7 వేల సంస్కృత శ్లోకాలలోకి అనువదించమని దత్తస్వామి ఆదేశించారు. మరొకప్పుడు వాసుదేవా నందులతో ఈ గ్రంథాన్ని రెండువేల సంస్కృత శ్లోకాలలోకి అనువదించి దానికి "సంహితాయన గురుద్విసాహస్ర" అని పేరు పెట్టమని దత్తుడు చెప్పారు. అలానే శ్రీ వాసుదేవానంద సరస్వతీస్వామి చేసిన ఈ రెండు రచనల రూపాలలో దత్తస్వామి నేడు దేశమంతటా తాండవిస్తున్నారు. నా చేత (రచయిత) దత్తస్వామి చేయించుకొన్న ఈ స్వేచ్ఛానువాదంలో ఈ రెండు గ్రంథాలలోని విశేషాంశాలను గూడ పొందుపరచాను. కారణం : అది శ్రీ దత్తావతార కథః శ్రీగురుని అక్షరస్వరూపం; వారి ప్రత్యక్ష శిష్యుడైన సిద్ధయోగిచేత వ్రాయబడింది; మరల శ్రీ దత్తాత్రేయ స్వరూపులైన శ్రీవాసుదేవానంద సరస్వతీ స్వామిద్వారా సంస్కృతంలో శ్రీ దత్తాత్రేయుడు అక్షరస్వరూపం ధరించారు.

# దత్తావతార పంచకం

శ్రీవాసుదేవానంద సరస్వతీస్వామి మనదేశ చరిత్రలో మహోజ్వలమైన కాలం (1850-1950) లో అవతరించారు. ఆ కాలంలో విశ్వగురుడైన దత్తాత్రేయస్వామి మరి నాల్గు రూపాలతో అవతరించారు. ఆ ఐదు దత్తావతారాలు - శ్రీఅక్కల్కోట స్వామి, శ్రీ శిరిడీ సాయిబాబా, ధునీవాలా దాదా, తాజుద్దీన్ బాబా, గజానన్ మహరాజ్. ఈ విషయం శ్రీ శిరిడీ సాయిబాబా ఒక భక్తునితో చెప్పారు. సద్గురువు దర్శనం కోరి "శ్రీ గురు చరిత్ర పారాయణ చేస్తున్న సాధకులెందరికో దత్తస్వామియే ఈ విషయం స్వయంగా చెప్పారు. (ఈ వివరం నాచేత దత్తస్వామి వ్రాయించుకున్న ఆయా మహనీయుల చరిత్రలలో చూడవచ్చు.) శ్రీవాసుదేవానంద సరస్వతులు వీరిలో ముగ్గురిని కలుసుకున్నారు. ఒక భక్తుడు శ్రీ వాసుదేవానందుల సన్నిధిలో ఒక మహాయజ్ఞం చేయ తలపెట్టాడు. శ్రీ వాసుదేవానందులు, "సాక్షాత్తూ దత్తావతారమైన అక్కల్కోటస్వామి సన్నిధిలో దీనిని నిర్వహించడం సముచితం. లేకుంటే, వారి ఆశీస్సులతోనైనా యిక్కడ జరిపించాలి" అన్నారు. ఒకప్పుడు ఆయన అక్కల్కోటస్వామిని దర్శించారట గూడ అలానే శ్రీ గజానన్ మహరాజ్లను గూడ దర్శించారు. శ్రీవాసుదేవానందులు రాజమండ్రిలో వున్నపుడు నాందేడ్ నుండి దాసగణు అను భక్తుడు వచ్చి ఆయనను దర్శించాడు. అతడు తిరిగి వెళ్ళేటప్పుడు శ్రీ వాసుదేవానందులు అతడికొక కొబ్బరికాయ యిచ్చి, "ఇది మా నమస్కారాలతో మా అన్నగారైన శ్రీ సాయిబాబాకు సమర్పించు. మమ్మల్ని మరువక ప్రేమతో కనిపెట్టి వుండమను. సన్యాసులమైన మేము యెవరికీ నమస్కరించము. కాని వారి విషయం వేరు" అన్నారు. తర్వాత దారిలో దాసగణు, అతని మిత్రులూ యేమారి వేరొక కాయ అని పొరపాటుపడి దానిని తినివేశారు. వాళ్ళు శిరిడీ చేరాక, ఇంకా యేమీ చెప్పకముందే సాయిబాబా, "నా సోదరుడిచ్చిన కొబ్బరికాయ యేది?" అని అడిగారు. వాళ్ళు జరిగినది చెప్పి, దానికి బదులు వేరొక కాయ యిస్తామన్నారు. ఆయన, "నా సోదరుడిచ్చిన కాయతో మరేదీ సాటిగాదు" అని వాళ్ళను క్షమించి విడిచిపెట్టారు.

# 'శ్రీ గురుచరిత్ర" గ్రంథమహిమ

వెయ్యిమంది భక్తులలో నిజంగా ముక్తికోసం ప్రయత్నించేవాడు యే ఒక్కడో వుంటాడని ద్వాపరయుగంలోనే శ్రీ కృష్ణుడు చెప్పాడు. అటువంటప్పుడు యీ కాలం సంగతి వేరే చెప్పాలా? అటువంటప్పుడు ఆత్మ జ్ఞానం గల సద్గురువులెంతు అరుదు! అట్టివారిని మాత్రమే ముముక్షువులు ఆశ్రయించాలని భగవద్గీత (4:34] చెబుతున్నది. అయితే వారిని గుర్తించి ఆశ్రయించేదెలా?" శ్రీ గురుచరిత్ర" అట్టి సంకల్పంతో పారాయణ చేస్తుంటే దత్తాత్రేయుడే మనలను అట్టి మహాత్ముని వద్దకు పంపుతారు. ఒక శ్రీమంతుడు,

'తనకు మగబిడ్డ కలిగితే, వేయిమంది బ్రాహ్మణులకు భోజనమిస్తానని మ్రొక్కుకొని గాణాపురంలో "శ్రీగురుచరిత్ర" పారాయణ చేసాడు. త్వరలో ఆ కోరిక నెరవేరిందిగాని, వ్యాపారంలో సర్వమూ కోల్పోయి, అతడు దిగులుతో మరణించాడు. అతడి భార్య కష్టం చేసి బిడ్డను పోషిస్తున్నది గాని, మ్రొక్కు గురించి భయపడి, గాణాపురం వెళ్ళి, ప్రత్యామ్నాయం తెల్పమని దత్తస్వామినే ప్రార్థించింది. ఆ రాత్రి కలలో దత్తస్వామి కన్పించి, "అక్కల్కోటలోని స్వామిని నేనే. వారికి భిక్షయిస్తే వేయిమందికి పెట్టినట్లే" అన్నారు. ఆమె అక్కల్కోటలో స్వామిని దర్శించగానే, వారు భిక్షకోరి ఆరగించి, "అమ్మా, వేయిమంది బ్రాహ్మణులకూ భోజనం ముట్టింది" అన్నారు! శ్రీ దత్తానుగ్రహం వలన ఆమె కోరిన ప్రత్యామ్నాయానికి తోడు సద్గురు దర్శనం గూడ లభించింది.

తలంగపూర్ (గుజరాత్)లో కల్యాణ్ జీ అనే ఒకరుండేవారు. వివాహమైన కొద్దికాలానికి అతడు విరాగియై సద్గురువుకోసం "శ్రీ గురుచరిత్ర" పారాయణ, సాధన చేసేవాడు. ఒకప్పుడొక సాధువు కన్పించి, శ్రీ వాసుదేవానంద స్వామిని ఆశ్రయించమని చెప్పాడు. నర్మదాతీరాన వున్న ఆ స్వామిని అతడు దర్శించగానే ఆయన కల్యాణ్జీని గృహస్థుగా వుంటూనే సాధన చేయమని చెప్పారు. త్వరలో అతడు సిద్ధుడై, గోదావరీతీరాన 'గూంజ్ లో స్థిరపడి, శ్రీ గాండా మహరాజ్ గా ప్రసిద్ధి చెందాడు.

పాండురంగని అనుగ్రహం వలన 1898 లో జన్మించిన తమ బిడ్డకు తల్లిదండ్రులు ఆ పేరే పెట్టుకున్నారు. అతని తల్లి అతని 8వ ఏట సరసోబా వాడిలోవున్న వాసుదేవానందుల దర్శనానికి తీసుకెళ్ళింది. అతడు ఆ యతీశ్వరుని కౌగిలించుకొని, "నేను మీవాణ్ణి!" అన్నాడు. నాటినుండి అతడు వారినే ధ్యానించే వాడు. ఒకరాత్రి కలలో, "శ్రీగురు చరిత్ర పారాయణ చేయి!" అని వినిపించింది. మరురోజే అకస్మాత్తుగా అతని మేనమామ వచ్చి అతనికి ఆ గ్రంథమిచ్చి వెళ్ళాడు. మేనమామకు ప్రసాదించినది శ్రీ సాయినాథులేనట! ఆ ప్రతిని అతని పాండురంగడు చాలా కాలం దానిని పారాయణ చేసి, దత్తస్వామి స్వప్న సందేశా న్ననుసరించి సన్యసించారు. దత్తస్వామి చూపిన 'అంగదీ స్వామి' అనే మహ నీయుడు ఆదేశించినట్లు రంగడు శీతోష్ణాలు లెక్కచేయక, కౌపీనధారియై ఏకాం తముగా తపస్సు, "శ్రీ గురుచరిత్ర" 108 పారాయణలూ చేసి సిద్ధుడై, శ్రీరంగావ ధూతగా నారేశ్వర్లో స్థిరపడ్డారు.

చాలిస్ గాఁవ్ (ఖాండేశ్)లో శంకరశాస్త్రి కుమారుడు మార్తాండ్ 11వ సం|| నుండే శ్రేష్ఠమైన గురువు దొరకాలన్న దీక్షతో సంధ్యావందనము, పూజ, ""శ్రీగురుచరిత్ర" పారాయణ చేసాడు. క్రమంగా అతడు నిరాహారియై తండ్రి అనుమతి, - ఆశీస్సులతో ఒక గదిలో ఏకాంతవాసం చేసాడు. ఎన్నాళ్ళకూ తన ఆశయం సిద్ధించలేదని ఒకరోజు అతడు దుఃఖిస్తుంటే, అకస్మాత్తుగా అతని యెదుట శ్రీ వాసుదేవానందస్వామి ప్రత్యక్షమై; "నీవింత కఠోరదీక్ష యెందుకు చేసావు? నేను చాతుర్మాస్యవ్రతం భంగం చేసుకురావలసి వచ్చింది" అన్నారు. ఆయనను మంత్రముపదేశించమని కోరగా, స్వామి అలానే చేసి అంతర్హితు లయ్యారు. నాటి నుండీ మంత్రజపము, పూజ, శ్రీ గురుచరిత్ర పారాయణ, దత్త నామస్మరణలతో నిరంతరం గడిపేవాడు. వివాహమై బిడ్డలు జన్మించాక భార్య మరణించింది. రెండవ భార్య గూడ అలాగే మరణించింది. ఆ తర్వాత శంకరశాస్త్రి యాత్రలు, నర్మదా ప్రదక్షిణము చేసారు. ఆయనకు గిర్నార్లో దత్తస్వామి, నవనాథులు, అనసూయాదేవీ దర్శనమిచ్చారు. పూణేలో గుళవణి, గుజరాత్లో మౌనీబాబా, రంగావధూత,

నిత్యానంద (వజ్రేశ్వరి), బాపూరావ్ మహరాజ్ గార్లను దర్శించి, తరణేలో శ్రీనానే మహరాజ్గా ప్రసిద్ధి చెందారు.

నేను (రచయిత) 1973లో గాణాగ్పూర్ లో నిత్యమూ, "శ్రీ సాయిబాబా "గురుగీత" పారాయణ చేస్తూ కొద్ది రోజులున్నాను. ఒకరోజాక మద్రాసీ సాధువుగారితో నేను, "ఇచట భక్తులు శ్రద్ధతో భిక్ష యివ్వటం కోసం ఆ స్వామి అలా చెప్పారేమో గాని, యిన్ని శతాబ్దాల తర్వాత ఆయనింకా భిక్షకు ఎలా ?" అన్నాను. ఆ సాధువిలా అన్నారు: "మొదట నేనూ అలాగే తలచాను గాని, యిక్కడ భక్తులకయ్యే అనుభవాలు విని, నిజమన్పించి, వారే | రూపంలో భిక్షకు వస్తారో గుర్తించి వారి పాదాలు పట్టుకోవాలని తలచి దీక్షగా "శ్రీ గురుచరిత్ర" పారాయణ చేస్తూ, భిక్షకు వచ్చే వారిని జాగ్రత్తగా గమనించ నారంభించాను. ఒకరాత్రి స్వామి స్వప్న దర్శనమిచ్చి, 'నారాక దైవరహస్యం. నన్ను గుర్తించ యత్నించవద్దు' అని హెచ్చరించారు. కాని నేను పట్టు విడువలేదు. మరురోజు కృష్ణలో స్నానం చేయగానే తీవ్రమైన జ్వరము, తలనొప్పి వచ్చి భిక్షకు పోకుండా నిద్రపోయాను. మధ్యాహ్నం 3-30 గం||లకు మెలకువ వచ్చేసరికి జ్వరము, తలనొప్పి తగ్గిపోయాయి. ఆకలి భరించలేక భిక్షకు వెళితే ఒక గృహస్థు, 'మధ్యాహ్నం నేనే గదా నీకు భిక్ష వేసాను?"

అని కసిరాడు. జరిగినది యెంత చెప్పినా అతడు నమ్మలేదు. నాటిరాత్రి స్వామి మళ్ళీ స్వప్నదర్శనమిచ్చి, 'నన్ను నీవేమి పట్టగలవు? నీ రూపంలో నేనే భిక్ష చేస్తాను' అన్నారు. ఆయన నేటికీ భిక్షకు వచ్చేమాట నిజం!"



యోగ్యులైన ఆ మ్లేచ్ఛరాజు మా అనుగ్రహానికి పాత్రులైనారని విని యెందరెందరో హీనులు గూడ యిక్కడకు వస్తారు. మా ప్రత్యక్ష సాన్నిధ్యం వారికి కల్గడం వలన అందరికీ యెంతో కీడు జరుగుతుంది. కనుక మా రూపాన్ని గుప్తం చేయడం ఒక్కటే కర్తవ్యం' అన్నారు. అది విని పురవాసులు యెంతగానో బాధపడుతూ నిశ్చేష్టులై బొమ్మల లాగా నిలుచున్నారు.

ఆనాటి వరకూ మానవాకారంతో కన్పిస్తున్న ఆ త్రిమూర్త్యవతారం అటు తర్వాత తమ స్థూలరూపాన్ని గుప్తపరచినప్పటికీ యీ గంధర్వపురంలో సుస్థిరంగా వున్నారు సుమా! అందుకు నేనే సాక్షిని, నేటికీ యీ గంధర్వనగరంలో ఆయనను విశ్వాసంతో భజించిన వారి కోరికలు తీరుతాయి. ఇతర యుగాలలో ఎన్ని వేల సంవత్సరాలు తపస్సు చేసినా కన్పించని యీ దత్తమూర్తి, యిప్పుడు భక్తుల పాలిట కల్పవృక్షమై యిక్కడ నిల్చారు. భుక్తి-ముక్తులను ప్రసాదించడానికి యీ భూమిమీద యింతకు మించినదేమున్నది?"

శ్రీ దత్తాయ గురవే నమః

శ్రీ శ్రీపాద శ్రీవల్లభాయ నమః శ్రీ నృసింహ సరస్వత్యైనమః



# శ్రీ గురుచరిత్ర

# అధ్యాయం - 51

శ్రీ గణేశాయ నమః శ్రీ సరస్వత్యై నమః. శ్రీ గురుభ్యో నమః

నామధారకుడు, "స్వామీ! శ్రీగురుడు వైఢూర్య నగరం నుండి బయల్దేరి. వెళ్ళి గౌతమీ పుష్కరయాత్ర పూర్తిచేసుకొని, తిరిగి గంధర్వపురం చేరాక యేమి చేసారో సెలవీయండి" అన్నాడు. సిద్ధయోగి యిలా చెప్పారు: "శ్రీగురుడు కొంతకాలం గంధర్వనగరంలోనే వున్నారు. అది ఈశ్వర నామ సంవత్సరం. అప్పుడు బృహస్పతి సింహరాశిలో వున్నాడు. ఒకనాడు ఆయన భక్తులందరితో, తాము శ్రీశైల యాత్రకు బయల్దేరుతున్నామని చెప్పారు. అది తెలిసిన గ్రామస్థులందరూ గూడ మఠం వద్దకు చేరుకొన్నారు. వాళ్ళందరూ కన్నీరు కారుస్తూ శ్రీ గురునితో యిలా అన్నారు: 'స్వామీ! మీరిప్పుడు శ్రీశైలయాత్రకు వెళ్ళవలసిన అవసర మేమిటి? తాము తమ అవతారకార్యం పరిసమాప్తి చేయదల్చినట్లు మాకు తోస్తు న్నది. ఇంతకాలమూ మీ అనుగ్రహంతో మా కష్టాలు, అభీష్టాలు తీర్చుకుంటు న్నాము. మీరీ గ్రామంలో విజయం చేయడం వలన యీ గంధర్వపురం భూలోక వైకుంఠమనదగిన మహాపుణ్య క్షేత్రంగా రూపొందింది. నిజానికి మీరు మా అందరికీ కులదేవతగా నిలిచారు. మేము అజ్ఞులము, దీనులము, మాకు మీరుదప్ప వేరు దిక్కులేదు. మమ్మల్ని విడిచి పెట్టిపోవడం మీకు న్యాయమేనా? ఏ తల్లియైనా తన బిడ్డలను యిలా విడిచి వెళ్ళిపోతుందా? ఎప్పుడూ వారిచెంతనే వుండి వాళ్ళను సాకడం ఆమె ధర్మంగాదా?' అన్నారు.

శ్రీనృసింహసరస్వతీస్వామి, వాళ్ళభక్తికి కరిగిపోయి, చిరునవ్వుతో ప్రేమగా యిలా అనునయించారు: 'బిడ్డలారా! మాపై యింత భక్తితో మెలిగే మిమ్మల్ని విడచి మేము మాత్రం పోగలమా? నిజానికి మేము ఎల్లప్పుడూ యీ గంధర్వ పురంలోనే వుంటాము. నిత్యమూ యీ సంగమంలో స్నానము, నిత్యకృత్యములు తీర్చుకొని, మధ్యాహ్న సమయంలో ఈ గ్రామంలో భిక్ష చేసుకుంటూ యీ మఠంలోనే మీ సేవలందుకుంటూ గుప్తంగా వుంటాము. కేవలం లౌకికుల స్థూలదృష్టికి మాత్రమే మేము శ్రీశైలం వెళ్ళినట్లు, యిక్కడ లేనట్లు కన్పిస్తాముగాని నిజానికి మా ప్రతిరూపాలుగా యిక్కడ ప్రతిష్ఠిస్తున్న మా పాదుకల రూపంలో యిక్కడే వుంటాము. ఇది ముమ్మాటికీ నిజము, ఎట్టి సందేహమూలేదు. మా భక్తులకు మేము ప్రత్యక్షము కానిదెప్పుడూ? ఈ గంధర్వపురంలో భక్తుల యోగక్షేమాలు కని పెట్టివుండే మమ్మల్ని సేవించేవాడు కోరినది యేది లభించదు? మీరందరూ నిత్యమూ యీ సంగమంలో స్నానంచేసి సాక్షాత్తూ కల్పవృక్షమైన యీ అశ్వత్థవృక్షానికి ప్రదక్షిణంచేసి, అనర్థాలన్నింటినీ తొలగించగల యిచ్చటి పాదుకలను అర్చిస్తూంటే సర్వభ్రమలూ తొలగి, సాక్షాత్తూ ఆనందమే సిద్ధిస్తుంది. ఎలాంటి చింతలు గలవారికైనా యిచ్చటి చింతామణి అనబడు విఘ్నేశ్వరుని ఆరాధించడం వలన సర్వ విఘ్నాలూ నశిస్తాయి. భక్తి శ్రద్ధలతో యీ అష్టతీర్థాలలో స్నానం చేసేవారికి సర్వ సిద్ధులూ సమకూరి, ముక్తిగూడ లభిస్తుంది. మూడు కాలాలలోనూ యీ మఠంలోని మా పాదుకలను పూజించి, నీరాజనమిచ్చి, నిర్మలమైన మనస్సుతో మమ్మల్ని స్మరిస్తే కోరినది తప్పక నెరవేరుతుంది. ఇకముందు పవిత్రమైన యీ దేశం మ్లేచ్ఛులైన యవనులకు అధీనమవుతుంది. వాళ్ళుగూడ యిక్కడకు వస్తారు. వారు వస్తే యిక్కడ భక్తులకు కష్టం

కల్గుతుంది. మేము యిక్కడ లేమని వాళ్ళు అనుకోగలందుకు స్థూలదృష్టికి శ్రీశైలం వెళ్ళిపోయినట్లు కన్పిస్తాము గాని, అదృశ్యంగా యిక్కడే భక్తులకు నిత్య ప్రసన్నులమై శాశ్వతంగా వుంటాము' అని చెప్పి, ఆయన తమ పాదుకలు మఠంలో విడిచిపెట్టారు. వెంటనే ఆయన మఠంనుండి బైటకు వచ్చి, సాయం దేవుణ్ణి, నందిశర్మను, నరహరి కవినీ, నన్నూ కూడా తీసుకొని శ్రీశైలానికి బయలుదేరారు. కొందరు శిష్యులు గంధర్వపురంలో వుండిపోయారు. శ్రీగురునివద్ద సన్యాస దీక్ష తీసుకొన్న కృష్ణసరస్వతి, బాల సరస్వతి, ఉపేంద్ర సరస్వతి, మాధవ సరస్వతి మొ॥న వారు అంతకుముందే శ్రీ గురుని ఆజ్ఞమేరకు తీర్థయాత్రలకు వెళ్ళిపోయారు. స్థానిక భక్తులు, మా ఐదుగుర్నీ ఊరి పొలిమేర వరకు వచ్చి సాగనంపి, చేతులు జోడించి శ్రీవారి దివ్యరూపం కనుమరుగయ్యేవరకు చూస్తూ నిలబడి, అటు తర్వాత వారి పాదాలను ధ్యానిస్తూ తిరిగి వెళ్ళిపోయారు.

అటు తర్వాత జరిగినది చెబుతాను విను వెనుక శ్రీగురుడు వైద్యనాథ క్షేత్రం నుండి బయల్దేరినప్పుడు, వారివద్ద సెలవు తీసుకొని తీర్థయాత్రలకు బయల్దేరిన శిష్యులు, వైఢూర్యనగరాన్ని పరిపాలించిన యవనరాజు, శ్రీగురుని ఆజ్ఞానుసారం కొంతకాలం ముందే శ్రీశైలం చేరి, అక్కడ వారి రాకకోసం ఎదురు చూస్తూ వున్నారు. బహుధాన్య నామ సం॥లో ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చింది. కుంభరాశిలోకి సూర్యుడు, కన్యారాశిలోకి బృహస్పతి ప్రవేశించారు. అది శిశిర ఋతువు. మాఘమాసము, కృష్ణపక్షము, ప్రతిపద (పాడ్యమి) శుక్రవారంనాడు శ్రీగురుడు శిష్యులమైన మా నలుగురితో కలసి శ్రీశైలం వద్దనున్న పాతాళగంగకు చేరారు. అక్కడ ఆయన స్నానం చేసి ఒక పుష్పాసనం సిద్ధంచేయమని మమ్మల్ని ఆజ్ఞాపించారు. మేమంతా త్వరత్వరగా పూలు సమృద్ధిగా సేకరించి, వాటిని అరటి ఆకులపై అమర్చి ఒక పూలనావ సిద్ధంచేసాము. అప్పుడు శ్రీగురుడు దానిని నది నీటిపై వుంచమని ఆదేశిస్తే మేమలానే చేశాము. అప్పుడాయన, 'మేము యీ పూలనావలో యీ పాతాళగంగ దాటి శ్రీశైలంచేరి, అక్కడ మల్లికార్జునునితో ఐక్యం చెందుతాము. మీరందరూ వెనక్కు తిరిగి గంధర్వపురం వెళ్ళిపోండి' అని చెప్పారు. కాని మేము నివ్వెరబోయాము.

ఆకస్మికమైన వారి ఆజ్ఞకు కృంగిపోయి కన్నీరు కారుస్తూ అలానే వుండిపోయాము. ఆయన మమ్మల్ని ఓదారుస్తూ యిలా అన్నారు. 'ప్రియ శిష్యులారా! మీరిలా దిగులుపడగూడదు. మీరు గంధర్వపురం వెళ్ళండి. మీకు ఎల్లప్పుడూ అక్కడ మా దర్శనం లభిస్తుంది. భక్తిలేనివారికి కన్పించక, భక్తులకు మాత్రమే దర్శనమివ్వదలచి మేమక్కడే గుప్తరూపంలో వుంటాము. మమ్మల్నే నమ్ముకొని కొలిచే భక్తుల యిళ్ళలో మేము ప్రత్యక్షంగా వుంటాము'. పుష్యమీ నక్షత్రంతో గూడిన ఆ శుక్రవారంనాడు, ఆ శుభసమయంలో శ్రీగురుడు ఆ పూలనావమీద కూర్చొని నది మధ్యకు సాగిపోతూ, ఒడ్డున నిలచిన మా అందరితో చివరిమాటగా యిలా చెప్పారు.

'నాయనలారా! మీకు సర్వశుభాలూ ప్రాప్తించుగాక! నల్గురు ఒక్కచోట చేరి మా చరిత్ర పారాయణ చేసేవారు, అందులోని స్తోత్రాలు పఠించేవారు, నామసంకీర్తన చేసేవారు మాప్రీతికి పాత్రులవుతారు. మా కథామృతగానం చేసేవారింట్లో నాల్గు పురుషార్థాలు, సిద్ధులూ నిత్యనివాసం చేస్తాయి, జీవితాంతమూ అష్టైశ్వర్యాలు, అటుతర్వాత ముక్తీ సిద్ధిస్తాయి. మేము ఆనంద నిలయానికి వెళ్తున్నాము. మేమచటికి " చేరగానే అందుకు గుర్తుగా మీవద్దకు నాలుగు తామరపువ్వులు యీ నదిలో కొట్టుకొనివస్తాయి. మీరు నలుగురూ వాటిని ప్రసాదంగా తీసుకోండి. మీరు వాటిని

ప్రాణంకంటే యెక్కువ విలువైనవిగా భద్రపరుచుకొని పూజించుకోవాలి. ఇది మా ప్రమాణం. దీనిని సంశయించరాదు' అన్నారు. ఆనావ ముందుకు సాగి కొద్ది సేపట్లో కనుచూపుమేర దాటిపోయింది. అయినా తాము ధరించిన కాషాయవస్త్రంతో తమ తలనుగూడ కప్పుకున్న వారి రూపం దివ్య తేజస్సులతో మా హృదయాలలో అలా నిలిచిపోయింది.

ఇలా శ్రీగురుడు తమ అంతిమ సందేశమిచ్చి ఆ పుష్పనావలో కొంత దూరం వెళ్ళి, ఆకస్మాత్తుగా అంతర్హితులయ్యారు. అంతలోనే ఆ పుష్పాసనంగాని, స్వామిగాని కన్పించకపోయేసరికి మేమందరమూ కన్నీరు కారుస్తూ ఆ శూన్య ప్రదేశంకేసి చూస్తూ వుండిపోయాము. కొద్దిసేపటికి నదికి అవతలి ఒడ్డునుండి ఒక పడవలో వచ్చిన కొందరు బెస్తవాళ్ళు మావద్దకొచ్చి, 'అయ్యా! ఒక స్వామి తూర్పు ఒడ్డుకు వెళ్తుంటే మేము చూచాము. వారి కాళ్ళకు బంగారు పాదుకలు న్నాయి. వారు కాషాయ వస్త్రము, చేతిలో దండము ధరించివున్నారు. ఆయన మాతో, 'మీరు వెళ్ళి మా శిష్యులతో మేము మీకెదురైనట్లు చెప్పండి. నాలుగు పువ్వులు నదీజలాలపై కొట్టుకుని వారివద్దకొస్తాయి. అవి తీసి వారికి యివ్వండి. మాపేరు నరసింహసరస్వతి. మేము స్థూలరూపంతో కదలీవనం వెడుతున్నాము. కాని, గుప్తరూపంలో యెప్పటికీ గాణాపురంలోనే వుంటాము. అక్కడే ఎల్లప్పుడూ మాసేవలో నిమగ్నమై వుండమని చెప్పండి' అని చెప్పారట. వాళ్ళు ఆ విషయం మాతో చెబుతూండగానే నాలుగు తామరపూవులు నదిలో కొట్టుకు వస్తున్నాయి. శ్రీగురుని ఆదేశం ప్రకారం ఆ బెస్తవారు వాటిని చూడగానే నదిలో దూకి యీదుకుంటూపోయి, ఆనాల్గు పూవులనూ తెచ్చియిచ్చారు. వారినుండి ఆ పూవులను అందుకుని, సాయం దేవుడు మా అందరికీ తలా ఒకటి యిచ్చాడు. అవి తీసుకొని మేము శ్రీగురుని స్మరించుకుంటూ గంధర్వనగరంలోని మఠం చేరుకొన్నాము.

శ్రీగురుడు అక్కడనుండి బయల్దేరి వెళ్ళినప్పుడు, మమ్మల్ని సాగనంపిన గ్రామస్థులందరూ దిగులుగా ఆయన కనుమరుగయ్యేవరకూ చూచి శ్రీగురుని గురించి మాట్లాడుకుంటూ మఠం చేరుకొని, అక్కడ కూర్చున్నారు. ఇంతలో అకస్మాత్తుగా అక్కడ శ్రీ నృసింహసరస్వతీస్వామి యథాపూర్వం తమస్థానంలో కూర్చొని కన్పించారు! ఆయనను చూచి అందరూ ఆశ్చర్యచకితులై నమస్కరించి లేచేసరికి వారి రూపం అదృశ్యమయింది. అంతటితో గ్రామస్థుల సంశయాలన్నీ మటుమాయమై, ఆ అవతారమూర్తి సామాన్య మానవులని తలచడం యెంతటి అపచారమో వారికి అర్థమయింది. అందరూ ఆ సర్వగతునికి సాష్టాంగ నమస్కారం చేసికొని తమ యిళ్ళకు వెళ్ళిపోయారు."

అప్పుడు నామధారకుడు, "స్వామీ! ఆ పూవులు ప్రసాదంగా పొందిన మహాత్ములెవరు?" అని అడిగాడు. సిద్ధయోగి, "స్వామికి శిష్యులెందరో వుండేవారు. వారిలో బాల సరస్వతి, కృష్ణ సరస్వతి, మాధవ సరస్వతి, ఉపేంద్ర సరస్వతి ముఖ్యమైనవారు. వీరేగాక, ఆ శ్రీశైలయాత్రాసమయంలో సాయందేవుడు, నందిశర్మ, నరహరి, నేను మాత్రమే స్వామిని అనుసరించాము. ఆ పూవులు ప్రసాదంగా లభించినవి మాకే. నాకు దొరికిన ప్రసాదమిదిగో చూడు! దీనిని భద్రంగా వుంచుకొని, మనస్సును నిశ్చలంగా గురు పాదాలపై నిలుపుకున్నాను. అందుకు సాధనంగా యీ 'గురుచరిత్ర' కూర్చాను. అంతేగాని గురు మహిమను పూర్తిగా వివరించడము మహామహితాత్ములకు మాత్రమే సాధ్యమవుతుంది. ఇది ఇహంలో పురుషార్థాలను, అటు తర్వాత పరమార్థాన్నీ

ప్రసాదిస్తుంది. దీని పారాయణ వలన సుఖము, పవిత్రత, శాంతి కల్గుతాయి; పాపాలు, రోగాలు నశిస్తాయి" అన్నారు.

శ్రీ దత్తాయ గురవే నమః.

శ్రీ శ్రీపాద శ్రీవల్లభాయ నమః శ్రీ నృసింహ సరస్వత్యైనమః.



# శ్రీ గురుచరిత్ర

# అధ్యాయం - 52

శ్రీ గణేశాయ నమః, శ్రీ సరస్వత్యై నమః. శ్రీ గురుభ్యో నమః.

అంతవరకూ ఎంతో ఆసక్తితో శ్రీగురుని లీలలు కోరికోరి చెప్పించు కుంటున్న నామధారకుడు, యీ సారి సిద్ధముని కథ ముగించిన తర్వాత గూడ యేమీ మాట్లాడకుండా నిశ్చేష్టుడై వుండిపోయాడు. నఖశిఖపర్యంతమూ కించిత్తైనా చలనం లేకుండా శిలాప్రతిమలా వుండిపోయాడు. అతని శరీరమంతటా వెంట్రుకలు నిక్కబొడుచుకొని వున్నాయి. చెమట బిందువులు నిల్చాయి. అతని శరీరమంతా కంపించి పోతున్నది. అతని ముఖంలోని భావమంతా పూర్తిగా మారిపోయి, అతని కన్నులనుండి సంతతధారగా అనందభాష్పాలు కారుతున్నాయి. ఈ ఎనిమిది విధాలైన భక్తిభావాలతోను అతడు సమాధి స్థితిలో వున్నాడని గ్రహించిన సిద్ధముని, లోకహితం కోరి అతనిని మేల్కొల్పాలని నిశ్చయించుకొన్నారు. కనుక అతని శరీరాన్ని తమచేతితో నిమిరి, వాత్సల్యంతో ఆలింగనం చేసుకొని యిలా అన్నారు: "శిష్యోత్తమా! నామధారకా! లే నాయనా! నీవిప్పుడు యీ సంసారసాగరాన్ని దాటి పరమానందంలో నిమగ్నుడవయ్యావు". శ్రీగురులీలామృతం పానం చేసి శ్రీ గురుచరణకమల ధ్యానమనే సహజ సమాధిలో నిలిచిన నామధారకుడు ఆ తన్మయత్వంలోనే శ్రీగురుణ్ణి యిలా స్తుతిస్తున్నాడు:

"స్వామీ! అచింత్యులైన మిమ్మెలా ధ్యానించేది? సర్వగతులైన మిమ్ము ఎక్కడికని ఆహ్వానించేది? ఈ విశ్వానికే ఆశ్రయమైన మీకు ఆసనం సమర్పించేదెలా? తీర్థక్షేత్రాలకే పవిత్రత చేకూర్చగల మీ పాద పద్మాలను దేనితో కడిగేది? విశ్వకర్తవు, సర్వకర్తవూ అయిన మీ చేతులకు అర్ఘ్యం సమర్పించేది ఎలా? సప్తసముద్రాలనే గాక యీ విశ్వమంతటినీ కడుపులో దాచుకొన్న మీకు ఆచమనం నేనెలా సమర్పించగలను? శుద్ధసత్యస్వరూపులైన మీ స్మరణయే లోకాలను పావనం చేస్తుంటే, మీకేమని స్నానం చేయించేది? ఆకాశమే శరీరంగా గల మీకు నేను సమర్పించదగిన వస్త్రమేమున్నది? చతుర్ముఖుడైన బ్రహ్మదేవుణ్ణి సృష్టించిన మీకు యజ్ఞసూత్రం వలన కల్గే లాభమేమున్నది? సర్వ జీవుల తాపాన్నీ హరించగల మీకు గంధలేపనమేమి చేయగలదు? ఇచ్ఛలే లేని మీకు ఏ పూలు సమర్పించి ప్రీతినొనర్చగలను? స్వయం సంతుష్టులు, ఆత్మానంద స్వరూపులుయైన మీకు నేను సమర్పించదగిన ధూప మెక్కడున్నది? స్వయం ప్రకాశకులు, జ్ఞానజ్యోతి స్వరూపులైన మీకు నేను దీపం సమర్పించడమా? జగత్ పోషకులైన మీకు యేమినైవేద్యం ఇవ్వగలను? నిత్య సుముఖులైన మీకు తాంబూలం వలన యేమి ప్రయోజనం? నక్షత్రగ్రహగోళాదులే మీకు నిత్య నీరాజనాలిస్తూ, సర్వ జీవుల హృదయాలలోనూ, మరియు విశ్వమందంతటా ప్రణవోచ్చారణ కొనసాగిస్తూ మీ మహిమను కీర్తిస్తుంటే మీకు నీరాజనమెలా యివ్వాలో, మిమ్మెలా స్తుతించాలో నాకు తెలియడంలేదు. సర్వగతులైన మీకు ప్రదక్షిణమెలా చేయాలి? ఈ నామరూపాత్మకమైన విశ్వమంతా మీ పాదమే అయివుండగా నేనెక్కడని

నమస్కరించేది? నాలోపల, వెలుపలా నిండియున్న మీకు యెచ్చటికని ఉద్వాసన చెప్పేది?" అంటున్నాడు.

అప్పుడు సిద్ధయోగి ఆనందంతో నవ్వుకొని "నాయనా! నీవిలా అంతర్ముఖుడవై నిశ్చలసమాధిలో నిలిచిపోతే యీ జగత్తును ఉద్ధరించేదెలా? ప్రజలందరూ ఉద్ధరించబడాలన్నదే శ్రీగురుని సంకల్పం. ఆయన చూపిన మార్గంలో పయనిస్తున్న మనకు, ఆయన అభీష్టం నెరవేర్చడమే ప్రధాన కర్తవ్యం. నీవిలా కూర్చుండిపోతే అదెలా సంభవం? కనుక నీవు మేల్కొని శ్రీ గురుచరణాలను స్మరిస్తూ, శాస్త్ర వాక్యాలను అనుసరిస్తూ యీ ప్రపంచంలోనే జీవించాలి" అని చెప్పి, చివరకు అతనిని మేల్కొలిపారు. నామధారకుడు కన్నులు తెరచి సిద్ధమునిని చూచి, "స్వామి! దయామయా! విశ్వాధారా! యీ సంసార సముద్రాన్ని భద్రంగా దాటించగల నౌకవంటివారు మీరు. నాపాలిటి శ్రీగురుడు మీరే!" అని, ఆయనకు సవినయంగా నమస్కరించాడు. సిద్ధయోగి సంతోషించి, "నాయనా! శ్రీ గురు కథాశ్రవణమందు నీకిట్టి శ్రద్ధ శాశ్వతంగా నిల్చుగాక! నీవు యీ "గురుచరిత్ర" నిత్యపారాయణ చేస్తుంటే యిహపరాలు రెండూ సిద్ధిస్తాయి. ఒక శుభ ముహూర్తాన నీవు పారాయణ చేసే స్థలాన్ని శుద్ధిచేసి, రంగవల్లులతో అలంకరించి, అక్కడ 'కూర్చొని మొదట దేశ కాలాలను స్తుతించు. అటు తర్వాత శ్రీ గురునికి మానసోపచారపూజ చేయి. పారాయణ సమయంలో మౌనంపాటిస్తూ మనోవికారా లను శమింపజేసుకో. అప్పుడు దీపం పెట్టి, గురువుకు, పెద్దలకూ మనసా నమస్క రించు. ఉత్తరదిక్కుగానో లేక తూర్పుముఖంగానో కూర్చొని, మొదటి రోజు 9వ అధ్యాయం చివరివరకు, రెండవ రోజు పారాయణ 10వ అధ్యాయం నుండి 21వ అధ్యాయం చివరి వరకు, మూడవ రోజున 29వ అధ్యాయం చివరి వరకూ, నాల్గవరోజున 35వ అధ్యాయం చివరివరకూ, 5వ రోజున 38వ అధ్యాయం చివరివరకూ 6వ రోజున 43వ అధ్యాయం చివరివరకు, చివరిరోజు, గ్రంధాంతము వరకు విధ్యుక్తంగా నీవు గురుచరిత్ర పారాయణ చేయాలి. తర్వాత నైవేద్యం పెట్టి, అటు తర్వాత సాష్టాంగ నమస్కారం చేయాలి. సప్తాహ పారాయణ చేస్తునంత కాలం భూమిపై నిద్రించడమే మంచిది. అది పూర్తయ్యాక యథాశక్తి బ్రాహ్మణులకు భోజనం పెట్టి, దక్షిణ, తాంబూలాలతో వాళ్ళను సత్కరించాలి. ఇలా నిర్దుష్టంగా శ్రీ గురుచరిత్ర పారాయణ చేస్తే తప్పక గురుదర్శనమవుతుంది. ఇలా చేస్తే సాటివారందరూగూడ ఆ భగవంతుణ్ణి సేవించుకోగల్గుతారు".

శ్రీ దత్తాయ గురవే నమః.

శ్రీ శ్రీపాద శ్రీవల్లభాయ నమః. శ్రీ నృసింహ సరస్వత్యైనమః.

******బుధవారం పారాయణం సమాప్తము ******



# అనుబంధం

# అవధూతోపాఖ్యానం

శ్రీ గణేశాయ నమః శ్రీ సరస్వత్యై నమః. శ్రీ గురుభ్యో నమః.

**ప్రస్తావన :** మొదట పరబ్రహ్మమొక్కడే ఉంటాడు. 'నేననేక మౌదునుగాక! అని ఆయన సంకల్పించి త్రిగుణాలనాశ్రయించి బ్రహ్మ విష్ణు మహేశ్వరులుగ ఆవిర్భవించి సృష్టి స్థితిలయాలు చేస్తాడు. ఈ త్రిమూర్తుల ఐక్యతే పరబ్రహ్మతో చేరిగురుతత్త్వమయింది. కనుక ఈ విశ్వమే గురురూపమని 'గురుగీత' చెబుతుంది..

అంటే సద్గురుని సేవించి ఆయన అనుగ్రహానికి పాత్రులయిన వారికి విశ్వం గురురూపమేనని అనుభవమౌతుంది. మోక్షప్రాప్తికి దోహదం చేసే ఆత్మీయుడవు తుంది. అలా అనుగ్రహం పొందినవారికి ఈ జగత్తే కర్మ బంధాలను కల్పించే ప్రతిబంధకమౌతుంది. శ్రీ కృష్ణుడు తననాశ్రయించిన అర్జునుడికి అట్టి అనుభవమే అనుగ్రహించాడు అందుకే ఆయన జగద్గురువు. కనుక అటువంటి గురువును ముముక్షువు ఆశ్రయించి తీరాలి. బ్రహ్మర్షి అయిన వశిష్ఠుని శరణు పొందేవరకు సృష్టికి ప్రతి సృష్టి చేసిన విశ్వామిత్రునికి బ్రహ్మజ్ఞానమే లభించలేదు సరికదా, అతడికి ఈ సృష్టి ప్రతిబంధకమై, అనేకసార్లు తపోభంగము చేసింది కూడా. సద్గురువునాశ్రయించక ఎంతటి తపస్వియైనా ముక్తిపొందలేడని యిట్టి పురాణ కథల సారాంశం. విశ్వమంతా తమరూపమేనని భక్తులకు ప్రత్యక్షానుభవాన్ని ప్రసా దించగలవారే నిజమయిన తత్త్వ ద్రష్టలు, సద్గురువులు, విశ్వమంతా వ్యాపించిన సద్గురు తత్త్వాన్ని ఎలా గుర్తించవచ్చో సిద్ధుడు నామధారకుడికి అవధూతో పాఖ్యానంతో ఉదహరించాడు. శ్రీ శిరిడీ సాయిబాబా వంటి సద్గురువు ఈ నాటికీ తన భక్తులకట్టి అనుభవాలు ప్రసాదిస్తున్నారు. అందుకే వారి చరిత్ర పఠించకుంటే శ్రీ గురుచరిత్రలోనివి, యితర మహనీయుల చరిత్రలలోనివి ఎన్నో అంశాలు అర్థంగావు.

ఈ అవధూతోపాఖ్యానంలో అవధూత 24 మంది గురువులనుండీ నేర్చిన జ్ఞానాన్ని మూల గ్రంథం టూకీగా సూచించింది. ఈ ఘట్టం గూర్చి ముముక్షువులు మననం చేసి తక్కిన అంశాలను ఊహించుకోవాలి. ఈ ఆంధ్రానువాదంలో ఈ అంశాలను గూడ భక్తుల వినియోగార్థం వివరించడమైనది.

## కథారంభము

గురు తత్త్వాన్ని సిద్ధుడు యిలా ఒక పురాణోపాఖ్యానంతో వివరించాడు. “యయాతి పుత్రుడైన యదుమహారాజు ఒకనాడు వేటకు వెళ్ళి, ఆ నిర్జనారణ్యంలో కటిక నేలపై పడుకొని వున్న ఒక సర్వసంగపరిత్యాగి, సమర్థుడూ అయిన ఒక అవధూతను చూచి, ఆశ్చర్యపడి, యిలా అడిగాడు: 'స్వామీ! ఆయుష్యము, సంపద, కీర్తి - వీటిని కోరి మానవుడు ధర్మార్థకామాలనే పురుషార్థాలయందు ఆసక్తుడవుతాడు. మీరు మాత్రము ఆసక్తులు గాలేదు. మీరు నైపుణ్యము లేకగాని, చేతగాకగాని, అజ్ఞానం వలనగాని యిలా వున్నారని చెప్పలేము. మీరు నిపుణులు, శక్తిమంతులు, జ్ఞానులూ అనే సంగతి చెప్పకుండానే తెలుస్తున్నది. మీరీ నిర్జనారణ్యంలో ఏ కోరికలూ లేకుండానే పరమానందంగా ఎలా సంచరించ గలుగుతున్నారు?' అపుడాఅవధూత లోక శ్రేయస్సుకై యిలా బోధించాడు: 'నేను 24 మంది గురువులనుండి జ్ఞానాన్ని గ్రహించి, అనుష్టించి, ఆత్మజ్ఞానం పొందాను. దానివల్లనే నిర్హేతుకమూ, శాశ్వతమూ అయిన ఆనందం లభిస్తుంది. నా గురువులెవ్వరో, వారినుండి నేను నేర్చినదేమో యోగ్యుడవైన నీకు వివరిస్తాను.

నా మొదటి గురువు భూమి. పూర్వకర్మననుసరించి జీవులకు ఈశ్వరుడే ఆయా దేహాలు ప్రసాదించి, వాటి జీవనానికవసరమైనరీతిగా ప్రవర్తింపజేస్తాడు. అటువంటి పశుపక్ష్యాదులెన్నో భూమిపై నివసిస్తున్నాయి. మానవులు భూమిని దున్నుతారు. బావులు, చెరువులు, కోనేళ్ళకోసం భూమిని త్రవ్వుతారు. జీవులన్నీ ఆమెపై మలమూత్రాలు విసర్జిస్తాయి. అయినప్పటికీ భూమి ఓర్పు వహించి, జీవులకు సస్యాలు, ఆశ్రయమూ

యిచ్చి పోషిస్తుంది. ఇన్ని జీవులనుండి తనకెంత బాధ కల్గినా చలించక, తన ధర్మాన్ని తాను అనుసరిస్తుంది. అలానే పూర్వకర్మవలన ప్రేరేపింపబడిన సకల భూతాలవలనా పీడింపబడినప్పటికీ ముముక్షువు, ప్రేమ - ఓరిమిలతో సహించి ధర్మమార్గంనుండి చలించకుండా ధైర్యం వహించి వుండాలని భూమినుండి నేర్చుకున్నాను. అలాగే, భూమి పైనున్న కొండలు దేవాలయాలకు, సకాల వర్షానికి కారణమైన అరణ్యాలకూ నెలవులు. ఎన్నో జీవులు వాటి గుహలలో నివసిస్తాయి. మానవులకెంతో ఉపకరించే నదులు వాటిలో జన్మిస్తాయి. గృహ, ఆలయ నిర్మాణాలకు కావలసిన రాళ్ళను ప్రసాదించడమే గాక పరమార్థాన్ని పర్వతం సకల జీవుల శ్రేయస్సు కొరకు మాత్రమే వుంటుంది. ముముక్షువైనవాడు. మానవులకు ప్రసాదించగల యెన్నో పవిత్ర తీర్థాలకు నిలయాలు పర్వతాలు. అలా జీవించగలగాలని దాని నుండి నేర్చుకున్నాను.

నా రెండవ గురువు వాయువు. వివిధ వస్తువులు శీత-ఉష్ణ, శుచి-అశుచి, సుగంధ - దుర్గంధాలతో సంబంధము లేకనే వాయువు అనాసక్తుడై వాటిమధ్య సంచరిస్తాడు. తాత్కాలికంగా వాటిచేత ప్రభావితుడైనట్లు కనిపించినా మరుక్షణమే తన సహజ నైర్మల్యంతో ఎల్లెడలా సంచరిస్తాడు. ముముక్షువుగూడ యింద్రియ విషయాల `నుభవమవుతున్నా సుఖ దుఃఖాది ద్వంద్వాలలో తగుల్కొనక హృదయము - వాక్కులకు అనుక్షణమూ సంభవించే విక్షేపాలను తొలగించు కోవడమే జీవిత లక్ష్యమని తలచి, ప్రాణరక్షణ కవసరమైన ఆహారం మాత్రం చేతనే యోగి తృప్తి చెందాలి.

నా మూడవ గురువు ఆకాశము. అప్పుడప్పుడు ఆకాశము, మేఘాలు, ధూళి, సంధ్యారాగాల చేత ప్రభావితమైనట్లు కన్పించినా, అది సహజంగా దేనికీ అంటనిది. శ్రీ ముని గూడ కాల గతిలో సృష్టించబడిన త్రిగుణాల వికారరూపమైన దేహానికీ, దానివలన కలిగిన మనో వికారాలకూ అంటని వాడై, ఆకాశంలా స్వచ్ఛుడై వుండాలని తెలుసుకున్నాను. అంతేగాక, ఆత్మ ఆకాశంవలె సర్వవ్యాపి. దానియందు గోచరించే వివిధ రూపాలచేత అది అవిభేద్యము, అసంగము, శుద్ధమూ అని గ్రహించాను. అట్టి ఆత్మయే బ్రహ్మంగదా!

నా నాలుగవ గురువు అగ్ని. అగ్నిదేవుడు ఒకప్పుడు విశేషాగ్నిగా ప్రజ్వలిస్తాడు. ఒకప్పుడు నివురుగప్పి మందంగా వెలుగుతాడు. మరొకప్పుడు రాపిడివల్లనే ప్రకటమయ్యే అగ్నితత్త్వంగా వస్తువులలో సూక్ష్మంగా దాగియుంటాడు. అట్టి సామాన్యాగ్ని, మధనంచేత విశేషాగ్నిగా ప్రకటమై, యజ్ఞం చేసేవారి పూర్వపాపాలను హరించి, రానున్న కర్మదోషాలను నివారించడం కోసము ఎవరినుండైనా సరే హవిస్సును గ్రహిస్తాడు. కాని తాను మాత్రం వారి పాపాలచేత అపవిత్రుడుగాకనే, వారి పాపాన్ని దహిస్తాడు. అలానే మునిగూడ తన తపశ్శక్తిని గుప్తంగా వుంచుకుంటూ, జనాన్ని పావన మొనర్చడానికై సర్వులనుండీ భిక్షనుగొని వారిననుగ్రహిస్తాడు. తాను మాత్రం అగ్నివలె యెట్టి భిక్షవల్లనైనా అపవిత్రుడు గాడు. అంతేగాక, అగ్నికి సహజంగా రూపం లేకపోయినప్పటికీ, కట్టెను చేరినపుడు ఆ రూపంతో భాసిస్తుంది. అలాగే ఆత్మగూడ, వివిధ దేహాలయందు తాదాత్మ్యం చెంది ఆయా రూపాలలో గోచరిస్తుంది. కాని ఆ ప్రతీతి వాస్తవమైనది గాదు. జీవులన్నీ సకాలంలో జన్మించి మరలా సకాలంలో మరణిస్తున్నా, వాటి ఆద్యంతాలు అట్టి ఉత్పత్తిలయాల వలె, గుప్తమైనవి; మధ్యదశలో మాత్రమే జీవులు గోచరిస్తాయి. కాని వాటి సృష్టి స్థితిలయాలకు ఆధారమైన ఆత్మ శాశ్వతము, వికారరహితము, అవ్యక్తము, సర్వగతమున్నూ, అలానే సామాన్యాగ్నిగూడ. కనుక అగ్నియొక్క తత్త్వాన్ని గూర్చి విచారించి, నేనూ అట్టి

తత్త్వజ్ఞానాన్ని పొందాను. అగ్ని వివిధ వస్తువుల గుణభేదాలను దహించి ఏకరూపమైన విభూతిగా మారుస్తుంది. అలానే ఈ తత్త్వజ్ఞానమనే అగ్ని వివిధమయిన వస్తువులను, గుణాలనూ నిరసించి, సర్వగతమైన విశ్వవిభుని తత్త్వాన్ని గ్రహించి తనలో తానే అణగియుంటుంది.

నా ఐదవ గురువైన సూర్యుడు సహజంగా ఒక్కడే. అయినా ఒక్కొక్క జీవికి ఒక్కొక్క ఘటంలోని నీటిలో ఒక్కొక్క ప్రతిబింబముగా భాసిస్తాడు. అలానే సహజంగా ఆత్మ అద్వయమైనప్పటికీ, దేహాది ఉపాధి భేదం చేత వివిధమూ, భిన్నమూ అయినట్లు కనబడుతుంది. అంతేగాదు. సూర్యుడేవిధంగా గ్రీష్మఋతువులో నీటిని తన కిరణాలతో స్వీకరించి వర్షఋతువులో విసర్జిస్తాడో, అలానే జ్ఞానిగూడ విషయాలనుండి అనుభవసారాన్ని సేకరించి, కరించి, సకాలంలో బోధరూపంలో జీవులకు ప్రసాదిస్తాడు. అయినా సూర్యునిలాగ అతడు కర్తృత్వం వహించడు. సూర్యుడు తన ప్రకాశంతో వివిధ వస్తువుల బాహ్యరూపాలను సర్వులకూ గోచరింపజేసినట్లే, జ్ఞానిగూడ వాటి నిజతత్త్వాన్ని జిజ్ఞాసువులకు తెలియజేస్తాడు. ఒకే సూర్యుని వలన కమలాలు వికసిస్తాయి, కలువలు ముకుళించుకుంటాయి. అలానే, జీవులు వారి వారి పరిపాకాన్ననుసరించి ఆ బోధను గ్రహించగల్గుతాయి. కాని సూర్యుడు మాత్రం అన్ని జీవులకూ వెలుగునూ, ఉష్ణశక్తినీ ప్రసాదించడంలో జీవుల గుణదోషాలను ఎంచనట్లే, మహాత్ముడు తన అనుగ్రహాన్ని సర్వులకూ సమానంగానే ప్రసాదిస్తాడు.

నా ఆరవ గురువు పావురము. ప్రేమ పాశబద్ధులైన ఒక పావురాలజంట పిల్లల్ని పెట్టి, వాటిని ప్రేమతో పోషిస్తుండేవి. ఒక బోయవాడు వలవేసి పిల్లలను పట్టుకున్నాడు. అప్పటికి వాటికాహారం తెచ్చిన ఆడు పావురం గూడ పుత్రవ్యామో హంతో ఆ వలలో దూకింది. దానినెడబాసి జీవించలేక మగపక్షి దానినను సరించింది. అలానే మానవ జన్మమెత్తిగూడ మమకార వ్యామోహాలతో తన వినాశం కొనితెచ్చుకుంటున్నాడని తెలుసుకొన్నాను. సహజంగా స్వేచ్ఛాయుతమైన ఆత్మ దేహేంద్రియాదులతో తాదాత్మ్యం చెంది సంసార దుఃఖాగ్నిలో, కర్మ వలయంలో, యిలాగే తగుల్కొని నశిస్తున్నదని గుర్తించాను.

నా ఏడవ గురువు కొండచిలువ. అది కదలక పడియుండి, యాదృచ్ఛికంగా ప్రాప్తించిన ఆహారంతో మాత్రమే జీవిస్తుంది. అది అల్పం కావచ్చు. అధికం కావచ్చు; రుచికరం కావచ్చు, కాకపోవచ్చు. అలానే మానవుడు గూడ ఇహపర సుఖాలకోసం లా, దైవికంగా లభించిన దానితో తృప్తిగా జీవిస్తూ, ఆత్మనిష్ఠ, ఓరిమిలతో వుండాలని గ్రహించాను. ఏమీ లభించనప్పుడు గూడ దైవమే గతియని నమ్మి, ఆ కొండచిలువవలె, జాగ్రన్నిద్రాదులు లేనివాడై అంటే ధ్యాననిష్ఠుడై ఇంద్రియ బలమున్నా స్వార్థ, అభిమానయుక్తమైన యెట్టి కర్మలూ చేయక, బలిష్ఠమైన దేహాన్ని మోస్తాడు. దర్శనాది సామాన్యవ్యాపారాలను సైతం ప్రత్యాహారం ద్వారా 'యోగి- పరిహరించాలని తెలుసుకొన్నాను. అంతేగాక, కొండచిలువకు బాహ్యమైన శుచి - అశుచిలతో నిమిత్తంలేదు. జనసంచారంనుండి, దూరంగా వుంటుంది. నిరంతరం - ధ్యానమనే అంతశ్శుచిలో నిమగ్నుడైన ముని గూడ అలానే జీవించాలని తెలుసుకున్నాను.

నా ఎనిమిదవ గురువు సముద్రం. వర్షఋతువులో నిండుగా పొంగిన నదులెన్ని తనలో కలసినా, సముద్రం పొంగదు. వేసవిలో ఆ నదులు ఎండినా కృంగదు. జ్ఞాని

సముద్రంలా పరిపూర్ణుడై సుఖాలకు పొంగక, దుఃఖాలకు కృంగక, ధర్మమనే చెలియలి కట్టను అతిక్రమించక, ఎట్టి పరిస్థితిలోనూ క్షోభించడు. అజేయుడై, తన యోగ రహస్యమెవరికీ అంతుపట్టనివ్వక అపారుడు, ప్రసన్నుడు, చలన రహితుడుగా జీవించాలని తెలుసుకున్నాను. అంతేగాక, సముద్రము తనలోని ముత్యాలను ఎన్నడూ బయటకు విడువదు. బయటనుండి చెత్తను కొంచెం గూడ తనలో చేరనివ్వదు. అలానే ముని తనలోని సద్గుణాలను వీడక, అవగుణాల నొక జీవించాలని తెలుసుకున్నాను.

మిడుత నా తొమ్మిదవ గురువు. అది అగ్నినిచూచి ఆకర్షింపబడి, అందులో దూకి నశిస్తుంది. అలాగే అజ్ఞాని, దుఃఖనిలయాలైన విషయాలు సుఖాలని భ్రమించి వాటిలో చిక్కి నశిస్తాడు. స్త్రీల రూపలావణ్యాలు చూచి మోహం చేత శిస్తాడని తెలుసుకున్నాను. అలాగాక, ముముక్షువు జ్ఞానమనే అగ్నిలో తన అజ్ఞానాన్ని ఆహుతి చేసుకోవాలని తెలుసుకొన్నాను.

నా పదవ గురువు ఏనుగు. మానవులు అడవిలో నిలిపిన ఆడ ఏనుగు ప్రతిమను చూచి భ్రమించి, దాని స్పర్శకోరి, మగ ఏనుగు దానిని సమీపించి బంధించబడు తుంది. ఆడ ఏనుగును చేరి విహరించే మగ ఏనుగును మరొక మగ ఏనుగు పోతుంది. అలానే రావణ, దుర్యోధనాదులలాగ స్త్రీ స్పర్శను కోరి అజ్ఞుడు సంసారబంధంలో చిక్కి ఆత్మనాశం కొనితెచ్చుకుంటాడని, ముముక్షువు అట్టి మోహాన్ని జయించాలనీ తెలుసుకొన్నాను..

నా పదకొండవ గురువు చీమ. దానివలెనే తానార్జించిన ధనంతో దానధర్మాలు చేయక కూడబెట్టేవాణ్ణి దుర్మార్గులు దోచేస్తారని తెలుసుకున్నాను. అయినా చీమవలెనే, ముముక్షువు గూడ సాధనలో యెన్ని విఘ్నాలు, అపజయాలు వచ్చినా నిస్పృహ చెందక నిరంతర కృషితో జ్ఞానధనం సాధించి కూడబెట్టాలి.

నా పన్నెండవ గురువు చేప. అది జిహ్వాచాపల్యంచేత ఎరకాశించి గాలర్ మ్రింగి నశించినట్లే, జిహ్వా చాపల్యానికి లొంగి మానవులు ఆత్మహాని కల్గించు కుంటారు. రుచిపట్ల అనాసక్తి, అల్పరస సేవనాలద్వారా జిహ్వాను జయించవచ్చు. 'జితం సర్వం జితే రసే', 'జిహ్వాను జయిస్తే సమస్తాన్నీ జయించవచ్చు. ఎరకాశించక, తనకు సహజమైన జలాన్నే ఆశ్రయించిన చేపవలె, తన సహజ నిలయమైన పరమాత్మను ఆశ్రయించినవాడు తప్పక ధన్యుడవుతాడు.

పింగళ అనే వేశ్య నా పదమూడవ గురువు. ఆమె ఒకసారి ధనాశతో ఆనందదాయకమైన నిద్రగూడ పాడుచేసుకొని, ఒక విటునికోసం వేచివేచి, చివరికిలా పరితపించింది: 'నేనెంత మూఢురాలను ఆనందమయుడైన ఆత్మారాముని విడచి అల్పబుద్ధితో భయశోక మోహాదులు కల్గించే మానవాధముని పొందగోరాను. ఇక ముందు ఆత్మను (శరీరాన్ని, జీవాత్మనూ) ఆత్మారామునికే ధనకీర్తుల కోసం సిద్ధులకాశించక, యోగి వైరాగ్యంతో ఆత్మానందాన్నే సాధించాలని పొందుతాను'- ఇట్టి నిశ్చయంతో ధన్యతనొందింది. అలానే గ్రహించా. ఆశయే దుఃఖము; ఆశ లేకపోవడమే సుఖము. ఒకరినుండి స్వీకరించడమే దుఃఖానికి మూలమని తెలిసి అపరిగ్రహమవలంబించాలని పింగళనుండి తెలుసుకున్నాను.

నా పదునాలుగవ గురువు శరకారుడు. అతడు బాణాలను చేయడంలో నిమగ్నుడై, ప్రక్కనుండిపోతున్న ఊరేగింపును గూడ గుర్తించలేదు. లోకులను భ్రమింపజేసే విషయజాలాన్ని విస్మరించి, ఆత్మనిష్ఠుడు గావాలని అతనిని చూచి తెలుసుకున్నాను. ఒక బాలుణ్ణి చూచి, యోగి చింతలు, మానావమానాలు విడచి ఆత్మరతుడై సుఖించాలని తెలుసుకున్నాను గనుక, ఆ బాలుడే నా 15వ గురువు.

కాల ప్రభావంచేత చంద్రకళలు వృద్ధిక్షయాలు పొందినట్లు కనబడతాయేగాని, చంద్రగోళం యెట్టి మార్పులూ చెందదు. అలానే జననం మొదలు మరణం వరకూ గల మార్పులన్నీ దేహానికే; దేహికి సంబంధించవు. చంద్రుడు సూర్యకాంతిని ప్రతిబింబిస్తాడేగాని, స్వయంగా ప్రకాశించలేడు. అలానే, దేహియైన, జీవుడు ఆత్మచైతన్యాన్ని ప్రతిబింబిస్తాడే గాని, స్వయంగా ప్రకాశించలేడని గుర్తించాను. కనుక చంద్రుడు నా 16వ గురువు. అతడు సర్వజీవులకూ ఆహ్లాదము, చల్లదనమూ ప్రసాదిస్తున్నా, వాటినుండి యేమీ ఆశించడు. జ్ఞాని భగవదనుగ్రహాన్ని జీవులకు పంచి, వాటి తాపాన్ని హరిస్తూ గూడ నిరపేక్షుడై వుండాలని తెలుసుకున్నాను.

తామరపువ్వుల పరిమళంచేత ఆకర్షింపబడిన తేనెటీగ - రాత్రంతా ముడుచుకొన్న కమలంలో బంధింపబడుతుంది. అలాగే యతిగూడ రుచి, సుగంధముగల పదార్థాలపట్ల ఆసక్తుడైతే వాటిని సమర్పించే గృహస్థుని యింట చిక్కి పతితుడౌతాడు. తేనెటీగ పూవులు నలగకుండా తేనెను గ్రహిస్తుంది. సన్యాసి గృహస్తులకెట్టి కష్టమూ కలుగజేయకుండా వారినుండి స్వల్పంగా మాత్రమే ఆహారాన్ని సంపాదించాలి. అంతేగాక, తుమ్మెద వివిధ రంగులుగల పువ్వులనుండి తేనెమాత్రమే గ్రహించినట్లు, వివేకి సకలశాస్త్రాల సారం మాత్రం గ్రహించాలి గాని, పాండిత్యానికై ప్రాకులాడరాదు. తేనెటీగ రేపటికని, మాపటికనీ తేనె కూడబెట్టడం వలన తేనె అమ్ముకొనేవాడు వాటి తేనెనపహరిస్తాడు. కనుక ముని రాత్రికని, రేపటికనీ ఆహారం కూడబెట్టక చేతులే భిక్షాపాత్రగా, కడుపే కంచంగా జీవించాలి. ఇదంతా నాకు నేర్పిన తేనెటీగ నా 17వ గురువు.

లేడి నా 18వ గురువు. కపటుడైన వేటగాడి సంగీతానికి పరవశించి అతనిచేత చిక్కినట్లు, లౌకికమైన గీతాలు వినగోరే ముముక్షువు గూడ విషయవాంఛలలో

చిక్కి, నశిస్తాడు.

గ్రద్ధ నా 19వ గరువు, ఒకప్పుడది ఒక చచ్చిన ఎలుకను కొనిపోతుండగా యెన్నో కాకులు, గ్రద్ధలూ ఆ ఎలుకనాసించి ఆ గ్రద్ధనెంతగానో బాధించాయి. చివరికి శ్రీ ఎలుకను విడిచింది. పక్షులన్నీ దానికోసం పోగానే గ్రద్ధ ప్రశాంతంగా ఒక చెట్టుమీద కూర్చున్నది. పామరులాశించే లౌకిక సుఖాలనాశించడం దుఃఖాన్ని కొని తెచ్చుకొనడమే అవుతుందని, వాటిని విడవడమే శాంతికి మార్గమనీ తెలుసుకున్నాను.

నా 20వ గురువు ఒక కన్య. ఆమెను చూడడానికి మగపెళ్ళివారు. వచ్చినపుడు ఆమె తల్లి యింటలేదు. వారిని సత్కరించడానికి ఆ కన్యయే ధాన్యం దంచుతున్నది. తన చేతిగాజుల సవ్వడి వారెక్కడ వింటారోనని వెరచి, ఒక్కొక్క చేతికి రెండుగాజులు మాత్రముంచుకున్నది. అవిగూడ శబ్దం చేస్తున్నాయి. అపుడు చేతికొక్క గాజుమాత్రముంచుకొని నిశ్శబ్దంగా కార్యం నెరవేర్చుకొన్నది. పలువురొకచోట చేరినా,

యిద్దరు చేరినా ముచ్చట్లు, కబుర్లు తప్పవని, యోగి ఏకాంతంగా సాధన చేసుకోవాలనీ నేర్చుకొన్నాను.

నా 21వ గురువు సర్పము. తనకొక గృహం నిర్మించుకొనక చెదలు శ్రమపడి నిర్మించుకొన్న పుట్టను విడిచిపోయాక, అందులో జీవిస్తుంది. చెదలవలె అవివేకులు శ్రమకోర్చి గృహాది ఉపాధులను పెంచుకొంటారు. కాని ముని, యితరులు నిర్మించిన మఠాలలోను, శిథిలాలయాలలోనూ, వృక్షమూలంలోనూ జీవించాలి. అంతేగాక, పాము తన జీవకృత్యాలను యే యితర జీవులకూ తెలియనివ్వదు' అలాగే యోగి గూడ తన అభ్యాస రహస్యాలను గుప్తంగా వుంచు కోవాలి. పాములా ఏకాంతాన్ని ఆశ్రయించిన యోగి, యోగాన్ని నిశ్చింతగా అభ్యసించగలడు. పాము తన కుబుసాన్ని నిశ్చింతగా విడిచినట్లు యోగిగూడ అంత్యకాలంలో యోగసిద్ధి వలన స్వచ్ఛందంగా దేహాన్ని త్యజించగలడు.

సాలెపురుగు నా 22వ గురువు. అది తాను వెడలగ్రక్కిన పదార్థంతో గూడు అల్లుతుంది. కొంతకాలానికి తిరిగి దానిని మ్రింగివేస్తుంది. అలానే బ్రహ్మ, తనలోనుండి ఈ సృష్టిని బహిర్గతం చేసి, తిరిగి తనలోనే లీనం చేసుకుంటాడు. జీవుడు గూడ తన హృదయగతములైన సంస్కారాలతో తన ఉపాధిని పెంచుకొని, మరలా అవసాన దశలో తిరిగి దానిని అంతర్గతం చేసుకుంటాడు. కనుక ఈ జగత్తంతా వాస్తవానికి బ్రహ్మమయమే అయినా, తత్త్వజ్ఞానాన్ని సాధించని వారికి యిది వాసనామయం.

నా 23వ గురువు భ్రమరకీటము, భ్రమరము (తన గుడ్డునుండి బయల్పడిన తన కీటాన్ని తెచ్చి, గూటియందుంచి, దాని చుట్టూ ఝుంకారం చేస్తుంది. ఆ భీతివలన కీటం అహర్నిశలూ భ్రమరాన్ని గురించే చింతించి, కొంతకాలానికి తానే భ్రమరమవుతుంది. అలానే సచ్ఛిష్యుడు తన గురువును నిరంతరం ధ్యానించి, తానే గురురూపుడౌతాడని గుర్తించాను.

నా 24వ గురువు జలము. జలం సర్వజీవులకూ దాహం తీరుస్తుంది. వాటి దేహాలకు శుచి, ఆరోగ్యము, చల్లదనమూ యిస్తుంది. వృక్షాలను, సస్యాలనూ పోషిస్తుంది. అన్ని జీవులకూ అంత మేలు చేస్తున్నా, తాను మాత్రం నమ్రతతో పల్లమైన ప్రాంతాలలోనే నిలుస్తుంది. అలానే ముని, తన్నాశ్రయించిన వారి హృదయ - దేహ తాపాలను తొలగించి రక్షిస్తూ గూడ, వినమ్రుడై యుండాలని గ్రహించాను."

# శ్రీ గురుచరిత్ర - కాల నిర్ణయం

"శ్రీ గురుచరిత్ర" శ్రీగురుని కాలంలోనే వ్రాయబడిందని గమనించాము. కాని శ్రీగురుని కాలం కొంత స్థూలంగా మాత్రమే నిర్ణయించడం సాధ్యం. వీరు కాశీలో కృష్ణసరస్వతి అనే యతీశ్వరుని వద్ద సన్యాసాశ్రమం స్వీకరించారు. విద్యారణ్యుల శిష్య పరంపరలో మూడవవారు శ్రీ కృష్ణసరస్వతి. విద్యారణ్యులు 14వ శతాబ్ది పూర్వార్థంలో శంకరాచార్యుల పీఠం అలంకరించినట్లు చరిత్ర చెబుతోంది. కనుక కృష్ణసరస్వతి 15వ శతాబ్ది ఆరంభంలో శ్రీగురునికి సన్యాసదీక్ష యిచ్చివుండాలి.

శ్రీగురుడు 9వయేట యిల్లువిడచి వెళ్ళిపోయారు. అటు తర్వాత 30 సం॥నకు ఆయన తిరిగి తన తల్లిని దర్శించారు. అంటే ఆయనకు 38 సం॥లు వుండాలి. ఆయన మాతృదర్శనానికి బయల్దేరే ముందు సాయందేవునితో, మళ్ళీ 16 సం॥ల తర్వాత తమ

దర్శనం అతనికి లభించగలదని చెప్పారు. అటు తర్వాత రానున్న బహుధాన్య నామ సం॥లో శ్రీశైలంలో మళ్ళీ తమను కలుసుకోమని ఆదేశించి ఆయన వెళ్ళిపోయారని శ్రీ గురుచరిత్ర చెబుతుంది. అంటే అప్పటికి శ్రీగురుని వయస్సు 54 సం॥లు అయివుండాలని, అంటే ఆయన క్రీ.శ. 1405, పార్థివనామ సం॥లో అవతరించి వుండాలని కొందరు చరిత్రకారులు తలచారు.

శ్రీగురుని చేత యవనరాజు భయంనుండి రక్షించబడిన సాయం దేవుని కుమారుడు నాగనాథరావు. అతని కుమారుడు గంగాధరుడు. అతని కొడుకు శ్రీనృసింహ సరస్వతి శిష్యకోటిలోనివాడు. అతడే సన్యసించి గంగాధర సరస్వతి అను పేర ప్రసిద్ధిచెందాడు. ఇతడు శ్రీగురుని అనుమతితోనే "శ్రీ గురుచరిత్ర" వ్రాసినట్లు ఆ గ్రంథారంభంలోనే స్పష్టంగా వ్రాసాడు. ఆ గ్రంథమంతా సిద్ధనామ ధారక సంవాదంగా వ్రాయబడింది. ఈ సిద్ధయోగి శ్రీగురుని ముఖ్యశిష్యులలో ఏడవవాడని శ్రీగురుచరిత్ర చెబుతున్నది. మిగిలిన శిష్యులందరినీ తీర్థయాత్రలకు - పంపివేసినపుడు గూడ సిద్ధయోగిని మాత్రం తమ చెంతనే వుండనిచ్చారు. కనుక గ్రంథకర్తయైన గంగాధర సరస్వతియే శ్రీ గురుని శిష్యుడైన సిద్ధుడన్నది స్పష్టం. "అయితే అతడు, తన పేరు నామధారకుడని వ్రాసుకోడానికి కారణమేమిటి?

శ్రీగురుని అనుగ్రహము, ఆదేశమూ పొందకముందటి గంగాధరుడే నామధారకుడు. అది పొంది, వారి అనుగ్రహానికి పాత్రుడైన తర్వాత తానే సిద్ధయోగి. అంతకుముందు తాను నామధారకుణ్ణని వ్రాసుకోవడంలో ఒక ధర్మశాస్త్ర సూక్ష్మం యిమిడివున్నది. జన్మతః బ్రాహ్మణుడై గూడ నిర్దుష్టంగా సదాచారం పాటించనివాణ్ణి నామధారకుడంటారని యాజ్ఞావల్క్యస్మృతి చెబుతున్నది. మొదట తాను అలానే జీవించినట్లు శ్రీగురుచరిత్ర ఆరంభంలో అతడు వ్రాసుకొన్నాడు. శ్రీగురుని అనుగ్రహం పొందిన తర్వాత తన పేరు చివర 'సరస్వతి'యనే గురునామాన్ని తన దీక్షానామంగా ధరించడంవలన గూడ అతడు నామధారకుడయ్యాడు. తన గురువుయొక్క అవతారకార్యాన్ని కొనసాగించడంలో భాగంగా శ్రీగురుని లీలలు ప్రచారం చేయడమే ఈయనకు సాధనగా విధించబడింది. అంటే యీ గ్రంథం 15వ శతాబ్దం ప్రాంతంలో వ్రాయబడి వుండాలి.

కొందరు పండితులు శ్రీగురుని నిర్యాణం క్రీ.శ.1516లో జరిగియుండాలని నిర్ణయించారు. "గురుచరిత్ర" ప్రకారం చంద్రుడు కుంభరాశిలో వుండగా ఒక్క బహుధాన్య సం॥లో శ్రీగురుడు అంతర్ధానమయ్యారు. ఇది 1456 మధ్య అయివుండాలని 'అప్రబుద్ధ' అనే చరిత్రకారుడు, కొందరు జ్యోతిశ్శాస్త్రవేత్తల • అన్నారు. కొన్ని వ్రాతప్రతులలో ఆ సం॥రమే ప్రస్తావించబడినట్లు 'నృసింహ సరస్వతి . మరియు దత్తసాంప్రదాయాల చరిత్ర' అనే మరాఠీ గ్రంథంలో రామచంద్ర చింతామణి డేరే వ్రాశారు. 'గురుచరిత్ర వచనం జనవరి 19, 1459కు సరిపోతుందని టి.బి. అభ్యంకరశాస్త్రి, కామత్ పండితులు నిర్ణయించారు.

శ్రీగురుడు 50 సం॥లు జీవించియుండవచ్చుని తలచి, వారి జనన సం॥ 1406 ప్రాంతమైయుండాలని. పూర్వ చరిత్రకారుల అంచనా. కాని యీ అంచనా సరిగాదు. ఈ వివరాలను విపర్యయ క్రమంలో వివరిద్దాము: శ్రీగురుని నిర్యాణము 1456; గాణాపురవాసం (23 సం॥) 1433 నుండి 1456 వరకూ; అంతకుముందు వాడీలో తపశ్చర్య 12 సం॥, అనగా 1420 నుండి 1432 వరకూ నరసింహ వాడీలో వున్నారు. ఔదుంబరవాసం 1419; పరలో

వైద్యనాథ నివాసం - 1418; గౌతమీ తటయాత్ర 1416 నుండి 1418 వరకూ; పునర్మాతృదర్శనం 1414; సన్యాసాశ్రమ స్వీకారం 1386; గృహ పరిత్యాగం (శ్రీగురు వచనం ప్రకారం పునరాగమనానికి 30 సం॥కుముందు) 1384; ఇది ఉపనయనం తర్వాత 1 సం॥కి, అనగా ఉపనయన సం॥ 1383; జననం - 1376. అంటే శ్రీగురుని ఆయుర్దాయం 80 సం॥లు.

శ్రీగురుడు వాసర బ్రహ్మేశ్వరంలో వుండగా సాయం దేవుని బాధ పెట్టిన యవనరాజే, దేశంలోని బ్రాహ్మణులను చర్చలో పరాభవించమని యిద్దరు పండితులను ప్రోత్సహించియుండవచ్చు. ఈ కుపండితులకు శ్రీగురుడు గర్వమణచినది గాణాపురంలోనే. అంటే సాయందేవుడు సెప్టెంబర్ 24, 1422 నుండి ఫిబ్రవరి 27, 1435 వరకూ రాజ్యపాలన చేసిన అహ్మద్ షా కొలువులోనివాడైయుండాలి. హిందువులపట్ల ఆదరణ కల్గియున్న రెండవ అల్లావుద్దీన్ శ్రీగురునికి భక్తుడైయుండాలి. ఇతడు ఫిబ్రవరి 27, 1435 నుండి ఫిబ్రవరి 13, 1458 వరకూ రాజ్యపాలన చేసాడు. ఇతని మరణానంతరం ఒక సంవత్సరంలోగా శ్రీగురుడు నిర్యాణం చెందియుండాలి.

శ్రీగురుని జీవితకాలంలో ఆరుగురు బహ్మనీ వంశపు యవనరాజులు బీదర్ను పరిపాలించారు. వీరిలో అయిదవవాడైన అహ్మదా 1432లో తన ముఖ్యపట్టణాన్ని బీదర్ (వైఢూర్య నగరము)కు మార్చాడు. తర్వాత రెండవ అల్లావుద్దీన్ 1435 నుండి 1458వ వ్రణంతో బాధపడ్డాడని చరిత్ర చెబుతున్నది. అతడే వెనకు జన్మలో శ్రీపాదులను సేవించిన రజకుడైయుండాలి. రెండవ అల్లావుద్దీన్ కు ప్రణబాధ హిందువైన సన్యాసి మహిమవలన తగ్గిందని ముస్లిం చరిత్రకారులు వ్రాయకపోవడానికి వారి స్వమతాభిమానం కారణమై యుండవచ్చు.

బీదర్ను 'శ్రీగురుచరిత్ర' పలుచోట్ల 'చాహురాష్ట్ర' అని వర్ణిస్తుంది. బీదర్లోని బహ్మనీలు రాజ్యాన్ని నాల్గు భాగాలుగా చేసారని చరిత్ర చెబుతున్నది. రెండవ అల్లావుద్దీన్ ఒక్కడేగాక, మరికొందరు ముస్లిం పరిపాలకులు గూడ శ్రీగురుని భక్తులైనట్లు తెలుస్తున్నది. బీజపూర్లో ఇబ్రహీం బాషా అనే యవనరాజు శ్రీగురుపాదుకలకు మందిరం నిర్మించాడు. బీజాపూర్ రాజైన యూసఫ్ ఆదిల్ షా గూడ బీజపూర్లోని తన కోటలో నిత్యపూజకోసం శ్రీగురుపాదుకా మందిరం నిర్మించాడు. ఇతడే నర్సోబావాడీ క్షేత్ర నిర్వహణకోసం జౌఖేడ్, గౌఖేడ్ అనే గ్రామాలను జాగీర్లుగా సమర్పించుకొన్నట్లు ఆధారాలున్నాయి.

శ్రీగురుని జననానికి, శ్రీపాదుల నిర్యాణానికీ మధ్యకాలం 25 సం॥లని నిర్ణయించి, వారి జీవితకాలం 1330-1351 అని చరిత్రకారులు అంచనావేశారు.

'శ్రీ గురుచరిత్ర' క్రీ.శ. 1460 ప్రాంతంలో మొదట సిద్ధముని శిష్యులోకచేత సంక్షిప్తంగా సంస్కృతంలో వ్రాయబడినదని 'మరాఠీ సారస్వత' అన్న గ్రంథంలో వినాయక లక్ష్మణ్భావే వ్రాశారు. తర్వాత కన్నడదేశీయుడైన గంగాధర సరస్వతి దానిని 7491 ఓవీలు, 51 అధ్యాయలుగల గ్రంథంగా మహారాష్ట్ర భాషలో వ్రాసారు. రచన గాణాపూర్లో జరిగింది. ఆ కాలంలో, ఆ ప్రాంతంలో మహారాష్ట్ర సంస్కృతి బాగా వ్యాపించడం వలన యీ రచనలో మరాఠీ, కన్నడభాషల మిశ్రమం కనబడుతుంది.

# శ్రీ గురుచరిత్ర

శ్రీగురుని శిష్యుడైన సాయం దేవుని తర్వాత అయిదవతరం వాడు సరస్వతీ అంటే అతడు శ్రీగురు నిర్యాణం తర్వాత 75 లేక 80 సం॥లవాడై యుండాలి. అతడు శ్రీగుటని నిర్యాణం తర్వాత సుమారు 100 సం॥లకు, అంటే సుమారు 1556 ప్రాంతంలో, ఈ గ్రంథాన్ని వ్రాసియుండాలి. సాయం దేవుని కుమారుడు నాగనాధరావు. అతనికొడుకు గంగాధరుడు. అతని కొడుకు శ్రీగురుని - శిష్యకోటిలోనివాడే. అతడే సన్యసించి 'గంగాధర సరస్వతి' యైనాడు. ఇతని తల్లిపేరు చంపాదేవి.

శ్రీ సిద్ధనామధారక సంవాదాత్మకమైన ధర్మార్థ కామమోక్ష ప్రతిపాదకమైన "శ్రీ గురుచరిత్ర" అనే పేరుగల యీ గ్రంథము శ్రీ దత్తాత్రేయస్వామియొక్క ప్రత్యక్షమైన ఆజ్ఞమేరకు - శ్రీ మత్సరమహంస పరివ్రాజకాచార్యులు, శ్రీ గత్తాత్రేయ స్వరూపులూ అయిన శ్రీ వాసుదేవానంద సరస్వతీ చరణులచేత సంస్కృత భాషలో వెలయించబడిన "శ్రీసంహితాయన గురుద్విసాహస్రి" అనే గ్రంథము. వారి ప్రత్యక్ష శిష్యులు, యోగి పుంగవులూ అయిన కీ.శే. శ్రీ సద్గురు గుళవణి మహరాజు (పూణే) గారి ఆశీస్సులతో స్వయంగా ప్రసాదించబడి, శ్రీ దత్తాత్రేయుని పూర్ణావతారము, సమర్థ సద్గురుడు అయిన శిరిడీ సాయినాథుని అనుగ్రహం వలన సద్గురు భక్తపాదరేణువైన నా చేత తెనుగు చేయించుకొనబడిన అక్షర ప్రసాదము. తప్పులు అనువాదకునివి. మహిమ స్వామిది.

శ్రీ దత్తాయ గురవే నమః

శ్రీ శ్రీ పాద శ్రీవల్లభాయ నమః శ్రీ నృసింహ సరస్వత్యై నమః



# శ్రీ దత్తధ్యాన శ్లోకాలు

1. దిగంబరం భస్మ విలేపితాంగం
   బోధాత్మకం ముక్తికరం ప్రసన్నం।
   నిర్మానసం శ్యామతనుం భజేహం
   దత్తాత్రేయం బ్రహ్మ సమాధి నిష్ఠమ్॥
2. యోగారూఢం యోగపట్టేన వీతం
   హస్తద్వంద్వం జానుయుగ్మే ప్రసార్య
   అంసాగ్రస్థ రక్త చంచజ్జటాకం
   దత్తాత్రేయం భావయే వీక్షమాణమ్॥
   (3వ పంక్తి "అంసాగ్రస్థ దివ్యభూషా జటాలం" అని గూడ చదువవచ్చు)
3. అనసూయాత్మజం చంద్రానుజం దుర్వాస సో గ్రజం।

నారాయణం మహావిష్ణుం దత్తాత్రేయం నమామ్యహమ్॥
4. సాధకః ప్రాతరుద్ధాయ కృతశౌచక్రియస్మరేత్।
ఆత్రేయం బ్రహ్మ రంధ్రస్థం ద్విభుజం గురురూపిణమ్ ॥
ఓంకారం ప్రత్యగాత్మానం పరబ్రహ్మ స్వరూపిణమ్।
పరమాత్మాన మవ్యక్తం దత్తాత్రేయం స్మరామ్యహమ్॥
5. దత్తాత్రేయం త్రిమూర్తిం హృదయమయ మహాపద్మ యంత్రాధి రూఢం।
శంఖం చక్రం త్రిశూలం డమరుకలశా వక్షాలాత్త ముద్రామ్ ॥
6. షడ్బిర్బర్బిర్ధదానం స్పటికమణినిభం షడ్జటా బద్ధ మౌళిం।
సర్వాలంకారయుక్తం భజతి మధుమతీ మోక్షలక్ష్మీ సమేతం॥
7. మందార మూలే మణి పీఠ సంస్థం సువర్ణ దానైక నిబద్ధదీక్షం।
ధ్యాయేత్పరీతం నవనిత్య సిద్ధిర్దారిద్ర్య దావానల కాలమేఘమ్॥
8. దత్తాత్రేయ హరేకృష్ణ ఉన్మత్తానంద దాయక।
దిగంబరమునే బాల పిశాచ జ్ఞానసాగర॥
9. మాలాకమండలు ధరకరపద్మయుగ్మే
మధ్య పాణి యుగళే డమరు త్రిశూలే।
యస్యస్థ ఊర్ధ్వకరయోః శుభశంఖ చక్రే
వందే తమత్రివరదం భుజషట్క యుక్తమ్ ॥
10. వాఖ్యాముద్రాం కరసరసిజే దక్షిణో సందధానో
జానున్యస్తాపర కరసరోజాత్తవేత్రో నతాంసః।
ధ్యానాధ్యానా త్సుఖపరవశా దర్ధమామీలితాక్షో
దత్తాత్రేయో భసిత ధవళః పాతునః కృత్తివాసాః!!
11. కాషాయ వస్త్రం కరదండ ధారిణం కమండలుం పద్మకరేణ శంఖం।
చక్రం గదా భూషిత భూషణాఢ్యం శ్రీపాదరాజం శరణం ప్రపద్యే ॥
12. ఔదుంబరః కల్పవృక్షః కామధేనుశ్చ సంగమః।
చింతామణి గురోః పాదౌ దుర్లభౌ భువనత్రయే॥

# శ్రీ దత్తాత్రేయ స్తోత్రము

జటాధరం పాండురంగం శూలహస్తం కృపానిధిమ్।
సర్వరోగహరం దేవం దత్తాత్రేయ మహం భజే॥

అస్య శ్రీ దత్తాత్రేయ స్తోత్ర మహామంత్రస్య। భగవాన్ నారదఋషిః।
అనుష్టప్ ఛందః। శ్రీ గురుదత్తాత్రేయో దేవతా।
శ్రీ గురు దత్తాత్రేయ ప్రసాద సిద్ధ్యర్థే స్తోత్రపారాయణే వినియోగః॥

జగదుత్పత్తి కర్రేచ స్థితిసంహార హేతవే।
భవపాశవిముక్తాయ దత్తాత్రేయ నమోస్తుతే॥

జరాజన్మ వినాశాయ దేహశుద్ధికరాయ చ।
దిగంబర దయామూర్తే దత్తాత్రేయ నమోస్తుతే ॥

కర్పూరకాంతిదేహాయ బ్రహ్మమూర్తిధరాయచ।
శ్రీరామ్యమైన వేదశాస్త్ర పరిజ్ఞాయ దత్తాత్రేయ నమోస్తుతే॥

హ్రస్వ దీర్ఘ కృశ స్థూల నామగోత్ర వివర్జితః।
పంచభూతైకదీప్తాయ దత్తాత్రేయ నమోస్తుతే॥

యజ్ఞభోక్రేచ యజ్ఞాయ యజ్ఞ రూపధరాయచ।
యజ్ఞప్రియాయ సిద్ధాయ దత్తాత్రేయ నమోస్తుతే॥

ఆదౌ బ్రహ్మ హరిర్మధ్యేప్యంతే దేవ స్సదాశివః।
మూర్తిత్రయ స్వరూపాయ దత్తాత్రేయ నమోస్తుతే॥

భోగలయాయ భోగాయ యోగయోగ్యాయ ధారిణే।
జితేంద్రియ జితజ్ఞాయ దత్తాత్రేయ నమోస్తుతే॥

దిగంబరాయ దివ్యాయ దివ్యరూపధరాయ చ।
సదోదిత పరబ్రహ్మ దత్తాత్రేయ నమోస్తుతే॥

జంబూద్వీపే మహాక్షేత్రే మాతాపుర నివాసినే।
జయమానం సుతం దేవం దత్తాత్రేయ నమోస్తుతే॥

భిక్షాటనం గృహే గ్రామే పాత్రం హేమమయం కరే।
నానా స్వాద్యమయీ భిక్షా దత్తాత్రేయ నమోస్తుతే॥

బ్రహ్మజ్ఞానమయీ ముద్రా వస్త్రమాకాశ భూతలే।
ప్రజ్ఞానఘనబోధాయ దత్తాత్రేయ నమోస్తుతే॥

అవధూత సదానంద పరబ్రహ్మ స్వరూపిణే।
విదేహ దేహరూపాయ దత్తాత్రేయ నమోస్తుతే॥

సత్యరూప సదాచార సత్యధర్మపరాయణ।
సత్యాశ్రయ పరోక్షాయ దత్తాత్రేయ నమోస్తుతే॥

శూలహస్త గదాపాణే వనమాలా సుకంధర।
యజ్ఞసూత్రధర బ్రహ్మన్ దత్తాత్రేయ నమోస్తుతే॥

క్షరాక్షరస్వరూపాయ పరాత్పరతరాయ చ।
దత్తముక్తి పరస్తోత్ర దత్తాత్రేయ నమోస్తుతే॥

దత్తవిద్యాయ లక్ష్మీశ దత్తస్యాత్మస్వరూపిణే।
గుణనిర్గుణ రూపాయ దత్తాత్రేయ నమోస్తుతే॥

శత్రునాశనకరం స్తోత్రం జ్ఞానవిజ్ఞానదాయకమ్।

సర్వపాపప్రశమనం దత్తాత్రేయ నమోస్తుతే॥

ఇదం స్తోత్రం మహద్దివ్యం దత్తప్రత్యక్షకారకమ్।
దత్తాత్రేయప్రసాదేన నారదేన ప్రకీర్తితమ్॥

## షట్పంచ శతనామ స్తోత్రముల

అత్రిభూ రనసూయేయో హరిల్లైనాత్మకో నుజః।
దుర్వాససో గ్రజః కృష్ణో వధూతః కపిలాగ్రజః॥

కృతాదియో,వేదబోధో వేదవేద ప్రవర్తకః।
కార్తవీర్యప్రియ స్సిద్ధి నిస్సంసారో జితేంద్రియః॥

బాలలీలో జటీ మత్తో బహుధాత్మా కుటీచకః।
హంసః పరమహంసాగ్ర్యః చార్వాకమతభంజనః॥

నాస్తికాచారమథనో బౌద్ధరాద్ధాంతనాశనః।
మధుమాంసాదిసంతుష్ట స్తపోవృద్ధో ద్విజోత్తమః॥

భస్మచ్ఛన్న స్మర్తృగామీ ఖట్వాంగీ యోగపట్టభృత్।
త్రిశక్తీశ స్త్రిశక్త్యాత్మా పీతాంబర విరాజితః॥

దీర్ఘశ్మశ్రుర్దీర్ఘనఖో వేత్రపాణిర్వ సన్ముఖః।
జాంబూనదోత్థవలయో వజ్రకుండల మండితః॥

క్షణే క్షణే రూపభేద దేశభేద సభక్త భాక్।
కోల్లాపురీ జపాసక్తః కాశీస్నానపరాయణః॥

మహూర్యాశీ సహ్యశాయీ నాదబ్రహ్మైక విఖ్షితః।
మృదంగవీణారసిక: త్రిపురాంతక సంస్కృతః॥

జ్ఞానోపదేశ దత్తాత్రేయో దిగంబర:।
షట్పంచాశతికం నామ దత్తాత్రేయస్య యోగినః॥

## నిత్యపాఠం

1. వరదః కార్తవీర్యాది రాజ రాజ్యప్రదో నఘ।
   విశ్వశ్లాఘ్యో మితాచారో దత్తాత్రేయో మునీశ్వరః॥
2. పరాశక్తి పదా క్లిష్టో యోగానందః సదోన్మదః॥
   సమస్తవైరి తేజోహృత్ పరమామృత సాగరః॥
3. అనసూయా గర్భరత్నం భోగమోక్ష సుఖప్రదం।
   శ్రీపాద వల్లభఃపాతు శ్రీనృసింహ సరస్వతీ॥
4. నమస్తే యోగిరాజేంద్ర దత్తాత్రేయ దయానిధే।

స్మృతిం తే దేహిమాం రక్ష భక్తింతే దేహిమే దృఢం॥

# శ్రీ దత్తాష్టకం

1. బ్రహ్మ శ్రీశహర స్వరూపమచలం లింగం జగద్వ్యాపకం
సత్వజ్ఞాన మనన్తమక్షర మజం చాంతర్బహిర్వ్యాపకం।
స్వచ్ఛన్దం సుగుణాశ్రితం సదమలం సర్వేశ్వరం శాశ్వతం
వన్దేహం గురుపూర్ణ బోధమనిశం శ్రీదత్త యోగీశ్వరమ్॥
2. విశ్వస్యాయతనం విరాట్తనుభృతం వేదాన్త సారంవిదు
శ్చన్ద్రాదిత్య కృశానునేత్ర మనఘం జ్యోతిఃపరం జీవనమ్।
ఉత్పత్తిస్థితి నాశనం జగదిదం చైతన్య బీజాత్మకమ్
॥వన్దే॥
3. శాస్త్రాకార మనేక కావ్య రచనా దీక్షోపమాంగీకృతం
కాలాతీత మనాది సిద్ధ పరమం కర్పూర గౌరోపమం।
నిశ్శీమం నిగమాదితం నిధిపరం నేతీతి నిర్ధారితం
॥వన్దే॥
4. భూతానామధి దైవతం నిజమహాతత్త్వం పురాణం పరం
మూలాస్థాన నివాసినం మునివరం మృత్యుంజయం ముక్తిదం।
సర్వోపాధి వివర్జితం చ విషయైః సర్వేన్ద్రియైః స్వాధితం ॥
వన్దే॥
5. ఆధివ్యాధిహరం నృణామతిశయం చారోగ్యమాయుఃకరం
సౌభాగ్యం సకలేప్సితార్థ కరణం సంపత్కరం శోభనం।
కళ్యాణం కలి దుఃఖదోష శమనం కారుణ్య పుణ్యేశ్వరం ॥
వన్దే॥
6. ఆనన్దానన్దకర్తా త్రిభువన గురుః శుద్ధసత్త్వ ప్రధానమ్
అజ్ఞానాం జ్ఞానదాతా గణయతి శయనం శుద్ధసత్త్వ ప్రకాశమ్।
సోహం సర్వాత్మత్త్వే జగదఖిలపదం పూర్ణబోధం పురాణం
॥వన్దే॥
7. భక్తానామభయంకరం భవభయ కేశాపహారం శుభం,
నిర్విఘ్నం నిరుపద్రవం సునియతం నిత్యోత్సవం నిర్మలం।
శత్రోస్తామసహారిణం లఘునతా తాపత్రయోన్మూలనం ॥
వన్దే॥

8. సో హంహంసః స్వగతవరపరం పూర్ణమానన్దసాక్షీ
వ్యోమాకారం విశాలం విభవప్రభవ భూతమాద్యన్తసాక్షి।

జ్ఞానం జ్ఞానార్ధసారం అహమిహ నియతం అద్వితీయం ॥
వన్దే॥

**(- శ్రీశంకరాచార్య)**



# గురుచరిత్రలో స్త్రీనింద?

అనేక ప్రాచీన ఆధ్యాత్మిక గ్రంథాలలోవలె ఈ గ్రంథంలో గూడా స్త్రీలలో సుమంగళులకు పతివ్రతా ధర్మాలు, పతిని కోల్పోయిన వారికి వైధవ్య ధర్మాలు చెప్పబడ్డాయి. ఆధునికులకు ఇవి స్త్రీలను అణచి పెట్టడానికి మన ప్రాచీనులేర్ప రచిన కుయుక్తిలాగా తోస్తాయి. కాని బ్రహ్మచారి, సన్యాసి పాటించవలసిన నియమాలు కూడా

అలానే వుండడం గమనార్హం. గురుగీతవంటి ఆధ్యాత్మిక గ్రంధంలో, ధర్మశాస్త్రాలలో, శ్రీ గురుచరిత్రలో దీపకుడు ఆచరించి చూసిన జీవితవిధానము కూడ అలానే వుంటాయి.

ప్రాచీన జీవిత విధానము ముక్తి లేక జ్ఞానము జీవితలక్ష్యంగా కలిగియుండేది, మనస్సును అనుక్షణము మారుతూండే కోరికల ప్రభావం నుండి విడుదల చేసి, అన్ని విషయాలలో ఒకానొక ఏకాగ్రత, తదనుశ్రుతమైన ధర్మానికి కట్టుబడడం సంస్కారానికి పట్టుకొమ్మగా నిలిచాయి. గురువుపట్ల శిష్యుడాచరించవలసిన ధర్మాలు గురుగీతలోనివి, గురుచరిత్రలోని వీ-పతివ్రతా ధర్మాలనెంతగానో పోలివుంటాయి. ఆధ్యాత్మిక రంగంలో ఇష్టదేవతకు, వివాహంలో ఒక జీవిత సహచారికి, తక్కిన జీవితమంతటిలో ఋషిప్రోక్తమైన ధర్మానికి కట్టుబడడమే లక్ష్యం.

కాకుంటే యెప్పుడూ భార్యే భర్తకులోబడి వుండవలసినట్లు శాస్త్రాలెందుకు చెప్పాయి? అన్న ప్రశ్న వస్తుంది. శిష్యుడు గురువుకీ, భక్తుడు దైవానికి కట్టుబడి వుండాలనడానికేది కారణమో అదే, గృహిణి కంటే వయస్సులో పెద్దమైన భర్త గురుసేవలో సుక్షితుడై యుండాలని, శిక్షణ పూర్తియైన అతని సేవలో లౌకిక జీవితంతోబాటు అటు ఆధ్యాత్మిక శిక్షణకూడా స్త్రీకి లభించేలా అలా నియమిం చారు. భర్తయెడల సహజంగా భార్యకుండే ప్రేమ, గురువుపట్ల శిష్యునికి, దైవంపట్ల భక్తునికీ వుండవలసిన ధర్మాలూ పటిష్ఠమవడమేగాక, తత్కారణంగా మూడూ. సార్ధకమవగలవన్న ఈ ధర్మ సూక్ష్మం: అయితే వీటికితోడు కాలాంతరంలో ఈ లక్ష్యాన్ని ఉద్దేశించని అనేక చిల్లర ధర్మాలను యధేచ్ఛగా ధర్మశాస్త్ర గ్రంథాలలో.. ప్రక్షిప్తంచేసి వుండవచ్చు. అదృశ్యమైన ఇష్టదేవతను యావజ్జీవితం ఏకాగ్రతతో ఆయన స్థాపించిన అగ్నిని సేవిస్తూవుండాలని శాస్త్రం. అలానే భర్తరూపం మరుగుపడిన స్త్రీ ఆ భర్తయే గురువు, దైవమూ అనే భావంతో సేవిస్తూ వుండాలని, అపుడు ముక్తి, లేక జ్ఞానానికి అవసరమైన సంస్కరణ జరుగుతుందనీ సూత్రము. ఇట్టి ఆచరణకు మనోవికారాలు అంతరాయాలవుతాయి. కనుక ఆ ప్రమాదాలను ముందుగా ఊహించి, వాటిని నిషేధించడానికవసరమైన దృక్పధమును సాధకు లకు శాస్త్రాలు బోధించాయి. ఒక వంక తల్లిగా, భార్యగా స్త్రీకి అత్యుత్తమైన విలువ నిచ్చిన శాస్త్రాలే బ్రహ్మచారికి, సన్యాసికీ చెప్పబడిన ధర్మాలలో స్త్రీని సర్వ అనర్థాలకూ మూలంగా చిత్రించాయి. ఇవి సహజంగా పురుషునిలో దాగియుండే ప్రకృతి సిద్ధమైన బలహీనత అనే రోగానికి ఔషధంగా మాత్రమే చెప్పబడ్డాయని గుర్తించాలి. సన్యాసికి, విధవరాలుకూ చెప్పబడిన ధర్మాలకుగల పోలికకిదే కారణం. ఏనాడైనా మోక్షము, లేక జ్ఞానమే జీవితపరమావధి అని విశ్వసించిన వ్యక్తులు పాటించవలసిన ధర్మాలే అవి. అట్టి లక్ష్యంలేని వ్యక్తులు గూడ ఆ ధర్మాలను పాటింపజూచినపుడు సామాజిక జీవితంలో అస్తవ్యస్తం తప్పదు.

# పూజ్య ఆచార్యుల వారిచే రచించబడిన
# శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర
## ( శ్రీ సాయి లీలామృతము)

"శ్రీ సాయిబాబా జీవితచరిత్ర" పారాయణ ముముక్షువులకు సాటిలేని సాధగము. ఈ విశ్వమంతా తమ రూపమేనని అనుభవ పూర్వకంగా భక్తులకు ఆయన నిరూపించినట్లు యింకెవ్వరూ నిరూపించలేదనే చెప్పవచ్చు. నామరూపాలతో నిండిన యీ సృష్టి విశ్వామిత్రుని వంటి తపస్వులను గూడ భ్రమింపజేసి భగవంతుణ్ణి మరచేలా చేస్తుంది. కాని సాయి చరిత్ర పారాయణ, చింతనా చేస్తుంటే అన్ని రూపాలూ భగవంతునివేనన్న గుర్తు సాధకులకు ఎప్పుడూ వుంటుంది. అందరినీ భ్రమింపజేసే యీ విశ్వమే సాయిభక్తులకు గురువై యీ సత్యాన్ని బోధిస్తుంది. వారి నిత్యజీవితమంతా అనన్య చింతతో గూడిన ధ్యానమే అవుతుంది. సాధనన్నది జీవితంలో ఒక భాగం అవటం మాని, వారి జీవితమంతా సాధనగా మారుతుంది. అటువంటి అనన్య భక్తుల యోగ " క్షేమమంతా ఆయనే చూసుకొంటారు. నానాటికీ యాంత్రికము, కేవల సంగీత క్రమంగా మారుతు పూజ మరియు నామ సంకీర్తనలు యీ పారాయణ వలన సజీవము, భావయుక్తమూ అవుతాయి. మానవహృదయంలో భక్తి నాటుకొని పూజ, నామ, జప, సంకీర్తనలు సార్థకంగా చేసుకోగల్గడానికే వాల్మీకి మహర్షి విస్తారమైన రామాయణము, వేదవ్యాసుడు భాగవతము వ్రాసి, తమ శిష్య ప్రశిష్యుల ద్వారా దేశ ప్రజలందరిచేత పారాయణ, శ్రవణము చేయించారు. బుద్ధుడు, క్రీస్తు మరియు మహమ్మద్ ప్రవక్తల జీవిత చరిత్రలే ప్రజలకు స్ఫూర్తినిచ్చి, ఆయా మతధర్మాలు ప్రజలలో దృఢంగా నాటుకొని, నానాటికీ విస్తరించేందుకు వుపయోగపడుతున్నవి. అటువంటప్పుడు "శ్రీ గురుచరిత్ర", "శ్రీసాయిబాబా జీవిత చరిత్ర" రాయణ విస్తారమైన సంప్రదాయంగా ప్రపంచమంతటా వ్యాపించవలసిన అవసరమున్నది.

# శ్రీ గురుచరిత్ర కృతజ్ఞతా మహోత్సవము

- ప్రతి సంవత్సరము సెప్టెంబరు మొదటి ఆదివారము శ్రీ గురుచరిత్ర కృతజ్ఞతార్చన దినముగా ప్రకటించడమయినది.
- గురు బంధువులు, సత్సంగ సభ్యులు, భగవత్ భక్తులు సామూహికంగా, అలా కుదరని పక్షాన తమ తమ గృహములయందు ఈ ఉత్సవాన్ని జరుపుకొనవచ్చును.
- ఉదయం సరిగ్గా 10 గంటలకు పూజ ప్రారంభించుకోవాలి.
- ఇతర దేశములవారు తమ వీలునుబట్టి ఇదే రోజున ఈ ఉత్సవము జరుపుకొనగలరు.
- మొదట రంగవల్లులపై చక్కని పీఠాన్ని అమర్చుకొని, దానిపై ఒక తెల్లటి వస్త్రాన్ని పరుచుకోవాలి. తరువాత అట్టి ఆసనంపై శ్రీ గురు చరిత్ర గ్రంథరాజాన్ని ఆశీనం చేయాలి.

- భక్తులందరూ ఈ గ్రంథరూపంలో సాక్షాత్తు శ్రీ గురుడే ఆశీనులై ఉన్నారని హృదయపూర్వకంగా భావన చేసుకోవాలి. ఈ భావన నిలబడేటట్లు తదనుగుణమైన కొన్ని లీలలను మననం చేసుకోవాలి.
- గంధ, పుష్ప సహితంగా శ్రీ సాయినాథ పూజా గ్రంథములో వివరించినట్లు శాస్త్రోక్తముగా, భావయుక్తంగా అష్టోత్తర నామావళితో పూజించుకోవాలి.
- నైవేద్యముతోపాటు అన్ని ఉపచారములు శ్రద్ధగా చేసుకోవాలి.

ఇంత అత్యుత్తమ మార్గాన్ని అందించిన పూజ్య గురుదేవులకు భక్తి శ్రద్ధలతో మంగళహారతి చేసుకోవాలి. ఇలా సామూహికంగా ఉదయం "శ్రీ గురు చరిత్ర" మహాగ్రంథాన్ని అర్చించి, ఎవరి వసతిని బట్టి వారు సాయంత్రం తమ తమ గృహాలలో, ఇరుగుపొరుగు వారిని ఆహ్వానించి ఈ గ్రంథాన్ని తిరిగి పూజించి ఉపోద్ఘాతం చదివి వినిపించడం ఎంతో శ్రేయస్కరం. వీలున్నవారు ఈ గ్రంథ రాజానికి నగర సంకీర్తన మొదలైన కార్యక్రమాలు సాయంత్రం జరుపుకొనడం ఎంతో మంచిది. స్థానిక మందిరాలలో విరివిగా ఈ గ్రంథాన్ని పారాయణ చేయించడం, క్రొత్తవారికి ఈ గ్రంథాన్ని పరిచయం చేయడం, గ్రంథాలను పేదలకు ఉచితంగా పంచడం కూడా ఎంతో శ్రేయస్కరం.

ఈ విధంగా మాస్టర్గారి వలన, వారి రచనల వలన, శ్రీ గురుచరిత్ర గ్రంథం వలన, ఇహపర శ్రేయస్సును పొందుతున్న మనమందరం శ్రద్ధాభక్తులతో, కృతజ్ఞతతో ఈ 'శ్రీ గురుచరిత్ర  కృతజ్ఞతార్చన'లో పాల్గొని సద్గురు అనుగ్రహానికి పాత్రులం కాగలమని ప్రార్థన.

**- మంగ భరద్వాజ ట్రస్ట్**

# సాయి లీలామృతం కృతజ్ఞతా మహోత్సవము

- ప్రతి సంవత్సరం మే నెల రెండవ ఆదివారము సాయి లీలామృతం కృతజ్ఞతార్చన దినముగా ప్రకటించడమయినది.
- గురు బంధువులు, సత్సంగ సభ్యులు, భగవత్ భక్తులు సామూహికంగా, అలా కుదరని పక్షాన తమ తమ గృహములయందు ఈ ఉత్సవాన్ని జరుపుకొనవచ్చును.
- ఉదయం సరిగ్గా 10 గంటలకు పూజ ప్రారంభించుకోవాలి.
- ఇతర దేశములవారు తమ వీలునుబట్టి ఇదే రోజున ఈ ఉత్సవము జరుపుకొనగలరు.
- మొదట రంగవల్లులపై చక్కని పీఠాన్ని అమర్చుకొని, దానిపై ఒక తెల్లటి వస్త్రాన్ని పరుచుకోవాలి. తరువాత అట్టి ఆసనంపై శ్రీసాయిలీలామృతము గ్రంథరాజాన్ని ఆశీనం చేయాలి.
- భక్తులందరూ ఈ గ్రంథరూపంలో సాక్షాత్తు శ్రీ గురుడే ఆశీనులై ఉన్నారని హృదయపూర్వకంగా భావన చేసుకోవాలి. ఈ భావన నిలబడేటట్లు తదనుగుణమైన కొన్ని లీలలను మననం చేసుకోవాలి.

- ❖ గంధ, పుష్ప సహితంగా శ్రీ సాయినాథ పూజా గ్రంథములో వివరించినట్లు శాస్త్రోక్తముగా, భావయుక్తంగా అష్టోత్తర నామావళితో పూజించుకోవాలి.
- ❖ నైవేద్యముతోపాటు అన్ని ఉపచారములు శ్రద్ధగా చేసుకోవాలి.

ఇంత అత్యుత్తమ మార్గాన్ని అందించిన పూజ్య గురుదేవులకు భక్తి శ్రద్ధలతో మంగళహారతి చేసుకోవాలి. ఇలా సామూహికంగా ఉదయం 'సాయి లీలామృతం' మహాగ్రంథాన్ని అర్చించి, ఎవరి వసతిని బట్టి వారు సాయంత్రం తమ తమ గృహాలలో, ఇరుగుపొరుగు వారిని ఆహ్వానించి ఈ గ్రంథాన్ని తిరిగి పూజించి ఉపోద్ఘాతం చదివి వినిపించడం ఎంతో శ్రేయస్కరం. వీలున్నవారు ఈ గ్రంథ రాజానికి నగర సంకీర్తన మొదలైన కార్యక్రమాలు సాయంత్రం జరుపుకొనడం ఎంతో మంచిది. స్థానిక మందిరాలలో విరివిగా ఈ గ్రంథాన్ని పారాయణ చేయించడం, క్రొత్తవారికి ఈ గ్రంథాన్ని పరిచయం చేయడం, గ్రంథాలను పేదలకు ఉచితంగా పంచడం కూడా ఎంతో శ్రేయస్కరం.

ఈ విధంగా మాస్టర్గారి వలన, వారి రచనల వలన, సాయి లీలామృతం గ్రంథం వలన, ఇహపర శ్రేయస్సును పొందుతున్న మనమందరం శ్రద్ధాభక్తులతో, కృతజ్ఞతతో ఈ 'సాయి లీలామృతం కృతజ్ఞతార్చన' లో పాల్గొని సద్గురు అనుగ్రహానికి పాత్రులం కాగలమని ప్రార్థన.

- **మంగ భరద్వాజ ట్రస్ట్**



**గురు మధ్యే స్థితం విశ్వం విశ్వమధ్యే స్థితో గురుః ।**
**గురుర్విశ్వం నచాన్యో஽స్తి తస్మై శ్రీ గురవే నమః ॥**

# శ్రీ గురు చరిత్ర

## నిత్య పారాయణ గ్రంథము

### పూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ



1938 October 30న పవిత్ర సాంప్రదాయక కుటుంబంలో శ్రీమాన్ అనంతాచార్య-శ్రీమతి బుచ్చమ్మ పుణ్యదంపతులకు నాలుగవ సంతానంగా జన్మించారు పూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ. తండ్రిగారి ఆదర్శ పెంపకంలో యోగాభ్యాసం నేర్చిన భరద్వాజులు గుడ్డినమ్మకానికి తావీయని రీతిన సత్యాన్వేషణతత్పరత కలిగి ఉండేవారు. వీరి చిన్నతనంలో సంభవించిన దుర్ఘటన కారణంగా జీవము, దైవము, మరణము, కాలము మొదలైన అంశాలపై వారికి ఉదయించిన అనేక ప్రశ్నలను అన్వేషిస్తూ సుదీర్ఘ యోచనలో 6 సంవత్సరాలు గడిపి చివరకు ప్రశ్నలే లేని అద్భుత ఆధ్యాత్మిక స్థితిని పొందారు. అన్ని ప్రశ్నలు సమాధానపడి చక్కటి సమన్వయం కుదిరింది. దైవం యొక్క ఉనికి నిర్ధారణ అయ్యింది. కొద్ది సం॥లు తరువాత శిరిడీ మొదట దర్శనంలో శ్రీ సాయినాథుని సమాధిమందిరంలో వారికే బ్రహ్మానుభూతి కలిగింది. అప్పటినుండీ శ్రీ సాయినాథుని గూర్చి అనేక ఉపన్యాసాలు, ప్రసంగాలు చేసి, గ్రంథాలు రచించి సాయిధర్మ ప్రచారానికి అంకితమయ్యారు శ్రీ భరద్వాజులు. సమకాలినులైన అనేక మహనీయుల ఆదరణ ప్రశంసలు అందుకున్న ఆచార్య భరద్వాజ 1989 April 12వ తారీకున తమ భౌతిక శరీరాన్ని చాలించారు. కానీ నేటికీ తాము నిత్యసత్యులుగా, పిలిచిన పలికే దైవముగా నిలిచి భక్తులకు అనేక అనుభవాలు భౌతిక సాక్షాత్కారాలు సైతం ప్రసాదించి ఇహపర శ్రేయస్సు ప్రసాదిస్తున్నారు. "మాస్టర్"గా, "ఆచార్యులు"గా ఎందరో భక్తులప్రార్థనలనందుకొని అనుగ్రహిస్తున్నారు.

శ్రీ గురుపాదుకా పబ్లికేషన్స్

SRI GURUPADUKA PUBLICATIONS,
C/0 SRI MANGA BHARADWAJA TRUST,
'BHAKTA NIVAS', 12-1-170/46P, HANUMAN NAGAR, JAIPURI COLONY,
NAGOLE, HYDERABAD -68, ANDHRA PRADESH, INDIA